# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 | జూలై 1997 | సంచిక 7

## విషయసూచిక



ప్రింటర్ అండ్ పబ్లిషర్: పి.కె.సూరి | ఎడిటర్: వి.కె.నరసింహన్



సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడును)

ఇండియాలో : రూ. 30/-

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5

సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134

సాధారణ సమాచారము: (1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములతో వ్రాయవలెను. (2) భారత దేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టు ద్వారాగాని చెల్లించవచ్చును. (3) క్రొత్త చందాయో లేక రెన్యువల్ చందాయో తెలియపరచవలెను. రెన్యువల్ అయినచో ప్రస్తుత చందా నెంబరు వ్రాయవలెను. (4) రెన్యువల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందుగా తిరిగి చందా రుసుమును పంపవలెను. (5) ఈ పత్రిక శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టువారి తరపున శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్, ప్రశాంతినిలయంలో ముద్రించబడినది.

ఫ్యాక్స్ : 0091-8555-87236/87390, గ్రామ్స్ : 'బుక్‌ట్రస్ట్'

టెలిఫోన్: 87375, STD కోడ్: 08555, ISD కోడ్: 0091-8555

# ఆదిశంకరుడు : అద్వైతసిద్ధాంతము

"మట్టి ఒక్కటేకాని దీని ద్వారా రూపొందే రూపనామములు అనేకంగా ఉంటున్నాయి. బంగారమొక్కటేకాని దీని ద్వారా తయారయ్యే ఆభరణములు వేరువేరుగా ఉంటున్నాయి. గోక్షీర మొక్కటేకాని గోవులు వివిధ రంగులతో వేరువేరుగా గోచరిస్తున్నాయి. అదేవిధంగా ఒకే భగవంతుడు అనేక రూపనామములను ధరించి యావద్విశ్వమును మోహింపజేస్తున్నాడు."

మట్టిని ఆధారముగా చేసుకొనియే కుమ్మరి కుండలను చేస్తున్నాడు. కుండలు పగిలిపోవచ్చు కాని మట్టి ఏనాటికీ మారదు. కనుక మట్టి ఉపాదానకారణము, కుమ్మరి నిమిత్తకారణము, కుండలు కార్యము. అట్లే ఆభరణములను ఎన్ని రకాలుగానైనా మార్చుకోవచ్చుగాని బంగారమును మార్చుటకు వీలుకాదు. ఆభరణమనే కార్యమునకు కంసాలి నిమిత్తకారణము, బంగారము ఉపాదాన కారణము. అదేవిధంగా ఉపాదానకారణమైన భగవంతుడు తానే ఒక నిమిత్తకారణస్వరూపుడైన సృష్టికర్తగా ఉండి అనేక రూపనామములతో కూడిన దేహములను సృష్టిస్తున్నాడు. మన దేహములు మట్టికుండలవంటివి. వీటితో అనేక విధములైన కర్మలను ఆచరిస్తున్నాము. అయితే క్రింద పడినప్పుడు కుండ పగిలిపోతుంది. అట్లే కాలము తీరినప్పుడు దేహము కూలిపోతుంది. కాని నిమిత్తకారణము, ఉపాదానకారణము అయిన దివ్యత్వం శాశ్వతంగా ఉంటుంది.

*దివ్యత్వానికి ఐదు పేర్లు :* దివ్యత్వమునకు ఐదు పేర్లుంటున్నాయి. మొదటిది పరనామము, రెండవది వ్యూహనామము, మూడవది విభవనామము, నాల్గవది అంతరాత్మ నామము, ఐదవది అర్చన నామము. ఈ ఐదునామములతో భగవంతుడు జగత్తును పాలిస్తున్నాడు.

పరనామ మనగా భగవంతుని నివాసమును సూచించునది. వైకుంఠవాసి అనేది పరనామము. వైకుంఠ మనగా ఏమిటి? కుంఠితము కానిది వైకుంఠము, మార్పు లేనిది వైకుంఠము. అందులో ప్రవేశించుటకు ఎవ్వరికీ వీలుకాదు. కాని అక్కడ భగవంతుడు ప్రకాశిస్తూ ఉంటాడు. సర్వమును తాను చూస్తూ ఉంటాడు, సర్వమును వింటూ ఉంటాడు, సర్వమును కల్పిస్తూ ఉంటాడు. కాని ఎవ్వరికీ కనిపించడు, ఎవ్వరికీ వినిపించడు.

శేషశాయి అనేది వ్యూహనామము. అనగా పాలసముద్రముపై శేషతల్పమున పవళించినవాడని అర్థము. అయితే దీనిని దేవతలు మాత్రమే దర్శించగలరుకాని సామాన్య మానవులు దర్శించ లేరు. హిరణ్యకశిపుని ఆగడాలు మితిమీరి పోయినప్పుడు దేవతలు శేషతల్పముపై పరుండిన నారాయణుని ప్రార్థించడం, ఆయన వారి ప్రార్థనలు మన్నించి వారికి సహాయం చేసే నిమిత్తమై ఈ లోకానికి కదలిరావడం మీరందరూ సినిమాల్లోను, డ్రామాల్లోను చూసే ఉంటారు.

మూడవది విభవనామము. రామకృష్ణాది దశావతారములన్నీ విభవనామమునకు సంబంధించి నవి. అనగా భగవంతుడు లోకసంరక్షణ నిమిత్తమై మానవ శరీరమును ధరించి పుడమిపై అవ తరించినప్పుడు విభవనామముతో పిలువబడతాడు.

దుర్గుణములను, దురాలోచనలను అరికట్టి సచ్చింతనను, సదాచారమును పెంపొందించే నిమిత్తమై అరుదెంచే అవతారములకు సంబంధించినదే ఈ విభవనామము.

నాల్గవది అంతరాత్మ నామము. మానవునియందు నఖశిఖ పర్యంతము సంచరిస్తూ సంరక్షిస్తూ ఉండే చైతన్యమునకు సంబంధించినదే ఈ అంతరాత్మనామము.

ఐదవది అర్చననామము. భగవదనుగ్రహం పొందడానికి భక్తిప్రపత్తులతో భగవంతుని వర్ణిస్తూ, భగవంతుని కీర్తిస్తూ మనం సల్పే భజనలకు, కీర్తనలకు సంబంధించినది అర్చననామము.

***నాల్గుయుగాలలో మానవజీవితం:*** కృతయుగవు యొక్క విశిష్టతను గూర్చి విన్నప్పుడు ఎటువంటి వారికైనా ఆశ్చర్యము కల్గుతుంది. ఇది నమ్మ దగినదేనా? అనే అనుమానం కలగడానికి కూడా అవకాశ మున్నది. కృతయుగములోని మానవుడు వందలకొలది సంవత్సరములు బ్రతికేవాడు. అంతే గాక ఆనాడు భౌతిక శరీరము ఈనాటివలె ఇంత చిన్నదిగా ఉండేది కాదు. ఆనాటివారు ఆజానుబాహులై ఉండేవారు. ఒక్కొక్కరి చేయి ఆరడుగుల పొడవుండేది. ఆనాటి మానవుడు అస్థిపంజరమై కండరములు, రక్తము కోల్పోయి నప్పటికీ ఎముకలతో ఉన్నంతవరకు జీవించి యుండేవాడు. ఎముకలలోనే ప్రాణముండేది. కాని త్రేతాయుగము వచ్చేసరికి మానవుని హైట్ (పొడవు) తగ్గిపోతూ వచ్చింది, దానితోపాటు ఆయుఃప్రమాణము కూడా తగ్గిపోయింది. త్రేతా యుగంలో మానవదేహములో కండరములు, మాంసము ఉన్నంతవరకు ప్రాణ ముండేది. ఇంక ద్వాపరయుగము వచ్చింది. ఆనాడు దేహములో రక్తమున్నంత వరకు మాత్రమే ప్రాణ ముండేది. మీకు చక్కగా తెలిసిన విషయమే. - మహాభారతయుద్ధంలో భీష్ముడు శరతల్పముపై 56 దినములు పరుండినాడు. అంబులు తగలడంచేత అతని దేహములోనున్న రక్తము నిదానముగా కారిపోతూ వచ్చింది. ఈవిధంగా 56 దినములు జరిగింది. రక్తమంతా కారిపోయేంతవరకు తాను బ్రతికే ఉన్నాడు. అనగా 56 దినములు ప్రాణముతో ఉండినాడు. కాని ఈ కలియుగంలో మానవుడు అన్నము ఉన్నంతవరకే బ్రతుకుతాడు, అన్నము తిన్నప్పుడే బ్రతుకుతాడు, లేకపోతే క్షీణించిపోతాడు. అనగా, ఈ కలియుగంలో మానవుడు అన్నగత ప్రాణిగా మారిపోయాడు. కాని ఆనాడు అన్నము కాదు ప్రధానం. కృతయుగ త్రేతాయుగములలోనివారు 'గాడ్'తో సంబంధము పెట్టుకున్నారు. ద్వాపరయుగము వచ్చేసరికి 'హెడ్'తో సంబంధము పెంచుకున్నారు. ఈ కలియుగంలో 'ఫుడ్'తో సంబంధము ప్రారంభమైనది. దీనిని మీరు చక్కగా అర్థం చేసుకోండి. కృతయుగ త్రేతాయుగములలో 'ధర్మమూల మిదం జగత్' అని విశ్వసించారు. కాని ద్వాపరయుగము వచ్చేటప్పటికి 'ధనమూల మిదం జగత్' అని భావించారు. మహాభారత యుద్ధానికి మూల కారణం ఇదే! కౌరవులు పాండవులకు కనీసం ఐదు గ్రామాలనైనా ఇవ్వడానికి నిరాకరించడం వల్లనే ఈ వ్యవహారమంతా జరిగింది. ఈ కలియుగంలో ధర్మమూల మిదం జగత్ కాదు, ధనమూల మిదం జగత్ కాదు, దయ మూల మిదం జగత్ అని గుర్తించండి. ఈనాడు ఏ హృదయములోను దయ లేదు. కనుకనే అనేక అవస్థలకు గురి అవుతున్నాడు మానవుడు.

***కలిప్రారంభం:*** ఈ కలి ప్రారంభంలో పరిస్థితి ఏ రీతిగా ఉందంటే - రాజులు కేవలం భౌతిక సుఖములకోసం ప్రాకులాడుతూ వచ్చారు.

ఒకరిపైన ఒకరు దండెత్తిపోయి అనేక హింసలు గావిస్తూ వచ్చారు. తద్వారా ఐకమత్యం క్షీణించి పోయింది. అన్యాయ అక్రమ అనాచారాలు మితిమీరిపోయాయి. ఇంతేగాక ఆనాటి పండితులు, వేదవిదులు, చదువరులు, మేధావులు వేదమునకు అనేక విపరీతార్థములు కల్పిస్తూ వచ్చారు. శాస్త్ర స్వరూపమును పూర్తిగా రూపుమాపారు. కనుకనే వేదశాస్త్రములపై ప్రజలకు విశ్వాసం లేకుండా పోయింది. అట్టి పరిస్థితులలో లోకాన్ని ఉద్ధరించేవారు ఒకరు కావాలి కదా! ధర్మాచరణ క్షీణించి అధర్మము అభివృద్ధి నొందినప్పుడు, వేదశాస్త్ర ప్రమాణములకు విరుద్ధమైన మార్పు ప్రారంభమైనప్పుడు లోకోద్ధరణ నిమిత్తమై భగవంతుడో లేక భగవత్‌శక్తితో కూడిన అవధూతలో లోకంలో ఉద్భవిస్తుంటారు.

***జీసస్ – జోరాష్టర్:*** జీసస్ మొట్టమొదట తాను దేవుని దూతనని చెప్పుతున్నాడు. క్రమక్రమేణ అంతరాత్మ తత్వాన్ని గుర్తించి, ''నేను దేవుని కుమారుడను'' అన్నాడు. తాను భగవంతుని కుమారుడైనప్పుడు భగవంతుని ప్రాపర్టీలో తనకు హక్కు ఉంటుంది కదా! కనుకనే భగవత్సంబంధమైన సదాలోచనలు, సచ్చింతనలు, సద్గుణములు అతనిలో ఆవిర్భవిస్తూ వచ్చాయి. ఈ ఆస్తి ఎప్పుడు లభ్యమైందో తండ్రియైన భగవంతుడు తన ఆస్తినంతా కుమారునికి అప్పజెప్పాడు. అప్పుడు జీసస్ అందులోను, ఇందులోను ఉన్నది ఒక్కటే అనే సత్యాన్ని గుర్తించి, ''నేను, నా తండ్రి ఒక్కటే'' అన్నాడు. అదే ఏకాత్మభావము.

అదేవిధంగా పర్షియన్ మతప్రవక్తయైన జోరాష్టర్ కూడా మొదట 'నేను వెలుగులో ఉన్నాను' (I am in the light)అన్నాడు. అనగా భగవంతుడు స్వర్గములో ఉన్నాడనీ, అతని వెలుగులో తాను జీవిస్తున్నాననీ భావించాడు. తరువాత బయట కనిపించునదంతా రిఫ్లెక్షన్ ఆఫ్ ది ఇన్నర్ బీయింగే అన్న సత్యాన్ని గుర్తించి, 'వెలుగు నాలో ఉన్నది' (The light is in me) అన్నాడు. చిట్టచివరికి, 'నేనే వెలుగును' (I am the light) అన్నాడు. ఈ మూడింటినీ ద్వైత విశిష్టాద్వైత అద్వైత సిద్ధాంతములతో పోల్చవచ్చును.

***శంకరులవారి బాల్యం:*** అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించినవారు శంకరాచార్యులవారు. ఆయన కేరళరాష్ట్రములో కాలడి అనే చిన్న పల్లెలో ఆర్యాంబ, శివగురువు అనే దంపతులకు జన్మించాడు. దురదృష్టవశాత్తు అతని మూడవ సంవత్సరంలోనే తండ్రి మరణించాడు. అయితే మరణించడానికి పదిదినములు ముందుగా శివగురువుకు ఒక కాంతిపుంజము కనిపించి కుమారునికి ఉపనయన సంస్కారం గావించుమని ఆదేశించింది. తత్ప్రకారంగా శివగురువు తన కుమారునికి మూడవ సంవత్సరం లోపునే ఉపనయనం చేశాడు. అప్పటి నుండి ఈ పిల్లవాడు గాయత్రీ మంత్రోపాసన ప్రారంభించాడు. తండ్రి మరణించిన తరువాత తల్లి ఆ దుఃఖాన్ని భరించుకొని ఈ పిల్లవానిని పెంచుతూ వచ్చింది. మొట్టమొదట ఒక గురువు దగ్గర ఇతనిని ప్రవేశపెట్టింది. ఆయన ఇతనికి అనేక విద్యలు నేర్పించాడు. ఒకనాడు ఆర్యాంబ గురువువద్దకు వెళ్ళి తన కుమారునికి వివాహం చేయవలసిందిగా కోరింది. కాని శంకరుడు తనకు వివాహం అక్కరలేదన్నాడు. ''నా దేహము, నా మనస్సు, నా సర్వస్వమును భగవంతునికే అర్పితం చేస్తున్నాను. కనుక నాకు వివాహము అక్కర లేదు'' అన్నాడు. తాను సన్యాసము స్వీకరించాలని పట్టుపట్టాడు. తల్లి చాల ఏడ్చింది. ఇది లోకసహజమే. కాని శంకరుడు తన పట్టు వదల లేదు.

**సన్న్యాస స్వీకారం:** ఒకనాడు తల్లి నీటి కోసమని కావేరికి వెళుతుండగా శంకరుడు వెనుకనే బయలుదేరాడు. ''అమ్మా! నేను సన్న్యసించడానికి అనుజ్ఞ ఇవ్వు'' అని పదే పదే అడుగసాగాడు. కాని ఆమె అంగీకరించలేదు. కావేరిలో దిగి నీరు ముంచుకుంటున్నప్పుడు సమయం చూసుకొని శంకరుడు కావేరిలోకి ఉరికాడు. ఒక చేయి పైకి ఎత్తి, ''అమ్మా! నన్ను ఒక మొసలి మ్రింగుతున్నది. కనీసం ఇప్పుడైనా నేను సన్న్యసించడానికి అనుజ్ఞ ఇవ్వు'' అని గట్టిగా ప్రార్థించాడు. ''నాయనా! నీవు సన్న్యసించడంవల్ల కాపాడబడే టట్లయితే సన్న్యాసము తీసుకో. నీవు బ్రతికి ఉంటే నాకు అంతే చాలు'' అన్నది. గట్టుకు వచ్చిన తరువాత శంకరుడు తల్లితో చెప్పాడు: ''అమ్మా! సంసారమనే సముద్రంలో భార్య అనే మొసలి నన్ను మ్రింగడానికి ప్రయత్నించింది. కాని నేను సర్వసంగపరిత్యాగం చేయడంవల్ల అది నన్ను వదలివేసింది.'' తల్లికి నమస్కరించి ఇల్లు వదిలాడు. ''నా అంత్య సమయంలో మాత్రం నీవు రావాలి'' అని తల్లి కోరింది. తప్పక వస్తానని వాగ్దాన మిచ్చాడు.

*దిగ్విజయయాత్ర:* ఆనాడు బస్సులు, కార్లు, ఏరోప్లేన్లు లేవు కదా! శంకరులవారు కాలినడకన యావద్భారత దేశంలో కాశ్మీరు మొదలుకొని కన్యాకుమారి వరకు పర్యటించి అద్వైత సిద్ధాంతమును ప్రబోధించాడు. ''ఏకమేవాద్వితీయం బ్రహ్మ'' - ''ఉన్నది ఒక్కటే, రెండు కాదు. చెఱకులోని రసమువలె భగవంతుడు అందరియందు రస స్వరూపుడై ఉంటున్నాడు. కాని మీరు కేవలం రూపనామములను ఆధారం చేసుకోవడంచేత భిన్నత్వాన్ని భ్రమిస్తున్నారు. బంగారము లేక నగలు లేవు, మట్టి లేక కుండలు లేవు. అట్లే ఈ జగత్తులోని రూపనామము లన్నింటికీ మూలాధార మైన దివ్యత్వం ఒక్కటే'' అని పండితులతో వాదించి ఒప్పించాడు. మండనమిశ్రుని కర్మ సిద్ధాంతమును ఖండించి అతనిని అద్వైత సిద్ధాంతములో ప్రవేశపెట్టాడు. క్రమేణ శంకరులవారి అద్వైత సిద్ధాంతమును అందరూ అంగీకరిస్తూ వచ్చారు. కాని 32వ ఏటనే శంకరులవారు తన శరీరాన్ని త్యజించాడు. కారణ మేమిటి? తాను వచ్చిన పని అయిపోయింది గనుక. శరీరాన్ని వదిలేముందు పూరీ, ద్వారక, కంచి, శృంగేరి, బెనారస్ క్షేత్రాలలో ఐదు లింగములను ప్రతిష్ఠించాడు. కంచిలో యోగలింగమును పెట్టాడు. మండన మిశ్రునికి సురేశుడని పేరు పెట్టి అతనిని కంచి పీఠాధిపతిగా చేశాడు. విద్యారణ్యులవారు కూడా శంకరుని శిష్యులే.

శంకరులవారు అద్వైతమతమును స్థాపించి, లోకంలో అల్లర్లను చల్లార్చి, ద్వేషాన్ని నిర్మూలించి ఏకాత్మభావముచేత ఆనందమును అభివృద్ధి పర్చడానికి కృషి చేశాడు. కాని తరువాత ఆయన శిష్యులలో ఏమాత్రము ఐకమత్యము లేకుండా పోయింది. శంకరులు చెప్పిన దానినే తాము వ్రాసినట్లుగా వ్రాసుకొని పేరుప్రతిష్ఠల నిమిత్తమై అనేక పాట్లు పడుతూ వచ్చారు. ఒకరు చెప్పినది ఇంకొకరు అంగీకరించ లేదు. క్రిష్టియన్ మతములో కూడా ఇంతే! జీసస్ పోతూనే అతని పదకొండుమంది శిష్యులలో భేదాభి ప్రాయములు బయలుదేరాయి. ఒక్క మేథ్యూ మాత్రమే జీసస్ చెప్పినవి ప్రచారం చేస్తూ వచ్చాడు. మొట్టమొదట జీసస్ శిష్యునిగా చేరిన పీటర్ కూడా అధికారులు తనను పట్టు కోవడానికి వచ్చేసరికి, ''నేను క్రీస్తు ఫాలోయర్‌ను కాదు' అన్నాడు. రణవిధంగా

్యలలో స్వార్థస్వప్రయోజనాకాంక్ష బయలు దేరడంచేత వారి ఉపదేశములన్నీ ఛిన్నాభిన్నముగా మారిపోయాయి.

**త్రిమత స్థాపకులు :** శంకరుల తరువాత వచ్చిన రామానుజులవారు అద్వైతమును ఖండించ లేదు కాని, దానిని కొద్దిగా సవరించి దానికి, ''విశిష్టా ద్వైతము'' అని పేరు పెట్టాడు. అద్వైతమును చెఱకు రసముతోను, విశిష్టాద్వైతమును చక్కెరతోను పోల్చవచ్చును. మూడవది ద్వైతము. దీనిని మధ్వాచార్యులవారు ప్రతిపాదించారు. దివ్యత్వము చక్కెర వంటిదైతే తాను ఆ చక్కెరను తినే చీమగా పుట్టాలని ఆకాంక్షించాడు. ''నేనే చక్కెరనైతే నాకు కలిగే ఆనందమేమిటి? కనుక నేను చక్కెర కాకూడదు, చక్కెరను తినేవానిగా ఉండాలి'' అన్నాడు. మానవుడు తనను తాను దైవానికి అర్పితం చేసుకోకుండా ఎన్ని సాధనలు చేసినా, ఎన్ని గ్రంథములు చదివినా ఈ 'చక్కెర'ను తినే అధికారము రాదు. ఇదిగో అమ్మ ఉప్పు అందే పట్టమ్మ పప్పు అన్నట్లుగా, ''ఓ భగవంతుడా! ఇదిగో నా హృదయమును నీకు అర్పిస్తున్నాను'' అన్నప్పుడు భగవంతుడు, ''నాయనా! ఇదిగో నీకు 'చక్కెర'ను అంది స్తున్నాను'' అంటాడు. ''యద్భావం తద్భవతి.'' భగవంతుడు ఎన్నటికీ మారడు. కాని మన భావములు మారితే భగవంతునిలో మార్పు కనిపిస్తుంది. కనుక మొట్టమొదట మన భావములను చక్కగా స్థిరంగా పెట్టుకోవాలి.

*(తేది: 6.9.96న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

---

## సర్వజనులను రక్షించు సత్యసాయి

సత్యలోకమ్మున సాధ్వి వాణినిగూడి,
సరసగోష్ఠిని సల్పుస్వామి సాయి
వైకుంఠపురమున వామాక్షి సిరిగూడి,
వరముల వర్షించు ప్రభువు సాయి
కైలాస శిఖరాన కాత్యాయనింగూడి
నర్తించు నటరాజు నవ్వ సాయి
ఇన్ని రూపాల ధరియించి యిలను వెలసి
సర్వజనులను రక్షించు సత్యసాయి
వాక్కు నందున ఆ వాణి వరలుచుండ!
కరమునందున ఆ లక్ష్మి ఘల్లుమనగ!
నడకయందున ఆ గౌరి నటునమాడ!
మూడు మూర్తులు సాయియై ముదము గూర్చు

-సింఘానరుల సోమయాజులు(కొవ్వూరు)

## ఎప్పుడేతెంతువో ఎఱుగనైతి!

ప్రతి పూవు సవరించి పరిమళమ్మును నింప
ఎప్పుడే తెంతువో ఎఱుగనైతి
పండు పండును పట్టి నింపింప రసమును
ఏ తరి నే తెంతు వెఱుగనైతి
ప్రతి ప్రాణి హృదయాన భక్తితత్వము పెంచ
ఏ రూపమున వత్తు వెఱుగనైతి
రవిచంద్రముల నల్ల దివిపైకి నంపగా
ఏ క్షణమ్మున వత్తు వెఱుగనైతి
ఎఱుక యొక్కింత గలుగ ఏమఱుదు నొక్కొ
జాగు సేయక నీ పాదసరసిజముల
వ్రాలి కన్నీట కడుగనే భాగ్యమంచు
సచ్చిదానందమయమూర్తి సత్యసాయి!

-తుర్లపాటి రాధాకృష్ణమూర్తి(గుంటూరు)

# "భజగోవిందం"

"సాధనమున పనులు సమకూరు ధరలోన." దేనికైనా మానవ ప్రయత్నం అత్యవసరం. నడవటంగాని, మాట్లాడటంగాని, తినటంగాని, వ్రాయటంగాని అన్నీ అభ్యాసముచేతనే మనకు అలవడుతున్నాయి కదా! కనుక దివ్యత్వాన్ని పొందాలనుకుంటే దానికి కూడా తగిన ప్రయత్నం చేయాలి. తట్టలోనున్న పదార్థము పొట్టలోకి చేరాలంటే నోటికి, చేతికి పని పెట్టకుండా తట్టలోని పదార్థముల పేర్లు నూరు పర్యాయములు చెప్పినా పొట్ట నిండదు. అదేవిధంగా రామా, కృష్ణా, గోవిందా అని కేవలం నామము నుచ్చరించినంత మాత్రమున చాలదు, దానికి తగినట్లుగా సమాజసేవ చేయాలి. సమాజ సంక్షేమము నాశించి ఆచరించే కర్మలే భగవత్కార్యాలుగా రూపొందుతాయి. కాని ఈనాటి మానవుడు ఈవిధమైన ప్రయత్నము చేయక దివ్యత్వము సులభంగా లభ్యం కావాలని ఆశిస్తున్నాడు.

పాలలోని వెన్నవలె, పూవులోని పరిమళము వలె, కట్టెలోని నిప్పువలె, ఫలములోని మధుర రసమువలె దివ్యత్వము ప్రతి మానవునియందు ఆత్మస్వరూపమై యున్నది. దీనినే వేదాంతము, "ఏకం సత్ విప్రాః బహుధా వదంతి" అన్నది. ఉన్నది ఒక్కటే. అది అనేకంగా కనిపిస్తున్నది. రూపములు భిన్నభిన్నంగా గోచరించవచ్చు. రూపములకు తగిన పేర్లను పెట్టుకోవచ్చు. కాని అన్నింటికీ మూలాధారమైన తత్వం ఒక్కటే అనే సత్యాన్ని నిరూపించారు శంకరులవారు.

ఒక మామిడి విత్తనమును నాటాము. అది కొంతకాలమునకు వృక్షంగా రూపొందినది. అందులో అనేకవందల ఆకులు, పుష్పములు, కాయలు ఉంటున్నాయి. కాయలను కోసి ఊరగాయ వేసుకోవచ్చు, ఆకులను తీసి తోరణాలు కట్టుకోవచ్చు, ఎండిపోయిన కొమ్మలను వంటచెఱకుగా ఉపయోగించుకోవచ్చు. అయితే ఈ కొమ్మలకు, రెమ్మలకు, ఆకులకు, ఫలములకు ఆ విత్తనమే మూలాధారము కదా! విత్తనము లేక వృక్షము లేదు, వృక్షము లేక కొమ్మలు లేవు, కొమ్మలు లేక కాయలు లేవు. ఇవన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడియున్నవి. వీటన్నింటి యొక్క ఏకత్వాన్ని నిరూపించేదే అద్వైతము.

*గురువుతో వాదము :* శంకరులవారు తండ్రి మరణించిన తరువాత తల్లి అనుమతితో సన్యాసం స్వీకరించి గోవిందుడనే గురువువద్ద చేరాడు. గోవిందుని గురువు గౌడపాదుడు. ఆయన కూడా ఋగ్వేదములో శంకరులవారికి చక్కని తర్ఫీదు నిచ్చాడు. 14 సంవత్సరములు పూర్తి కాకపూర్వమే శంకరులవారు నాలుగు వేదములను, ఆరు శాస్త్రములను పఠించాడు, తర్క వ్యాకరణ మీమాంసలను క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. "శ్రద్ధా వాన్ లభతే జ్ఞానం," శ్రద్ధ కల్గినవానికి ఏదీ అడ్డు కాదు. సామాన్యంగా 50సంవత్సరములైనా నాల్గు వేదములను, ఆరుశాస్త్రములను పఠించుటకు వీలుకాదు. కాని ఈ బిడ్డ చాల స్పెషల్. ఒక్కతూరి చూస్తే చాలు! శంకరులవారి మేధాశక్తిని

చూసి గురువుకే చాల ఆశ్చర్యం కలిగింది. ఒకనాడు శంకరుని పరీక్షించాలని గోవిందుడు అతనితో వాదమునకు పూనుకున్నాడు. శంకరుడు వినయవిధేయతలు గలవాడు. విద్యార్థికి వినయమే భూషణము కదా! కనుక గురువుతో వాదోప వాదములకు పూనుకునేముందు అతనికి నమస్కరించి, ''మీతో వాదము చేయుటకు అనుజ్ఞ ఇవ్వండి'' అని ప్రార్థించాడు. ఈవిధంగా గురువుయొక్క ఆజ్ఞ తీసుకొని గురువుతోనే వాదము ప్రారంభించాడు. వేద శాస్త్ర ప్రమాణములకు విరుద్ధం కాకుండా గురువు వాక్యములను ఖండిస్తూ అత్యద్భుతంగా వాదించి గురువు మెప్పును పొందాడు.

**కాశీకి ప్రయాణం :** ఆనాటి పండితులు తమ విద్యను ధనము నిమిత్తమై ధారపోస్తూ వచ్చారు. ఈనాటికి కూడా విద్యార్థులు విద్య కూటికోసం ఏర్పడినదిగా భావిస్తున్నారు. ఇది చాల పొరపాటు. విద్య విజ్ఞానంకోసం, కృషి కూటి కోసం. ఈ సత్యాన్ని గుర్తించిన శంకరులవారు పండితులను సరియైన మార్గంలో ప్రవేశపెట్టాలని చాల కృషి చేశాడు.

*''నిద్దుర నుండి లేచి మరి నిద్దుర పోయెడు దాక పొట్టకై*
*హద్దును, పద్దులేక వ్యయమందగ జేయుచు జీవితంబు నీ*
*విద్దెల ధారవోసి అరవింద దళాక్షుని విస్మరించి ఏ*
*పెద్దసుఖంబు నొందితివొ ప్రీతిగ యోచన చేయి మానవా!''*

*''పుస్తకముల్ పఠించితి, పూర్తిగ చూసితి సర్వశాస్త్రముల్*
*నిస్తులమైన విద్యలను నేర్చితినంచు గర్వమేల? నీ*
*హస్తయుగంబు మోడ్చి పరమాత్ముని భక్తితొ కొల్వలేని ఈ*
*ప్రస్తుత విద్యలన్నియు ధాత్రి నిరర్థకము కాదె మానవా!''*

అని శంకరులవారు కన్నీటిధారలు కార్చాడు. గోవిందుడు, అతని గురువైన గౌడపాదుడు కూడా పండితుల అజ్ఞానమునకు చాల విచారించారు. లేతవయస్సునందే శంకరునిలో ఇంతటి ఉన్నత భావములు ప్రవేశించడం చాల అదృష్టమని భావించారు. ఒకనాడు అతనిని దగ్గరకు పిల్చుకొని, ''నాయనా! నీవు సకల విద్యాపారంగతుడ వైనావు. ఇంక నీ విక్కడ ఉండనక్కర లేదు. రేపటి దినమే నీవు కాశీకి బయలుదేరు. అక్కడి పండితులకు జ్ఞానమును బోధించు. అద్వైత సిద్ధాంతమును జగద్వ్యాప్తి గావించు. దీనికి నీవే సమర్థుడవు'' అన్నారు. గురువుల ఆజ్ఞను శిరసావహించి శంకరులవారు 16 సంవత్సరాల వయస్సులో తన శిష్యులను తీసుకొని కాలినడకన కాశీకి బయలు దేరాడు. దారిలో ఒక పండితుడు ఒక చెట్టు క్రింద కూర్చుని, ''డుకృఞ్ కరణే, డుకృఞ్ కరణే...'' అని పాణినీ వ్యాకరణాన్ని వల్లించడం చూశాడు. అక్కడే ప్రారంభించాడు భజగోవింద శ్లోకాలను.

*''భజగోవిందం భజగోవిందం*
*గోవిందం భజ మూఢమతే*
*సంప్రాప్తే సన్నిహితే కాలే*
*నహినహి రక్షతి డుకృఞ్ కరణే''*

''ఓ మూర్ఖుడా! అంత్యసమయంలో నిన్ను ఈ వ్యాకరణం రక్షించదు. బంధుమిత్రులు నీ తోడు రారు. ధనకనక వస్తు వాహనాదులు నీ వెంట రావు. నీ వెంట ఇంట జంట ఉండి కాపాడేది దైవచింతన ఒక్కటే. కనుక దైవాన్ని స్మరించు'' అని బోధించి కాశీలో ప్రవేశించాడు. అక్కడ శంకరులవారి కీర్తి శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధి నొందసాగినది.

**పండితుల సమావేశం :** కాశీలో ఒకనాడు పండితుల సమావేశం జరిగింది. పండితులందరూ చేతులకు పెద్దపెద్ద కంకణాలు ధరించి, మెడలో రుద్రాక్షమాలలు వేసుకొని ఖరీదైన శాలువలు కప్పుకొని ఠీవిగా వచ్చి కూర్చున్నారు. ఆ సభలో

ఆడంబరమునకు ఏమాత్రము లోటు లేకుండా ఉండినది. శంకరులవారు మాత్రం మోకాలు వరకు ఒక చిన్న పంచ కట్టుకొని, ఒక చిన్న టవల్ కప్పుకొని చాల సింపుల్‌గా వచ్చారు. పండితులు ఇతనిని చూసి, ''పండితుడంటే ఎంత గంభీరంగా ఉండాలి! ఇతని మెడలో ఒక్క రుద్రాక్షమాలైనా లేదు, చేతికి ఒక్క కంకణమైనా లేదు. ఇతను మాకు ఏమి చెప్పగలడు?'' అని తమలో తాము గుసగుసలాడుకోసాగారు. శంకరునిది చిన్న వయస్సు. వేదికనెక్కాడు, చేతులు జోడించాడు.

''వలదు వలదు ధనదాహము నరుడా!
మంచి బుద్ధితో మానుము కోర్కెలు
కర్మ ఫలితమే కదరా విత్తము
కలిగినంతలో కనరా తృప్తిని
హరిగోవిందా హరిగోవిందా
హరిగోవిందా అనరా మందా!''

''ధనదాహమును వీడి దైవదాహమును, ధర్మదాహమును పెంచుకోండి'' అని చక్కగా ఉపన్యాసము ప్రారంభించాడు. పిట్ట కొంచెము, కూత ఘనము అన్నట్లుగా, చూడటానికి చిన్నగా ఉన్నాడుకాని చెప్పే నీతులు చాల గొప్పగా ఉన్నవని అక్కడ చేరిన పండితులు, వారి శిష్యులు చాల ఆశ్చర్య పోయారు. చెప్పే నీతులే కాదు, అతని ప్రవర్తన కూడా చాల గొప్పగా ఉండినది. ''మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం.'' దీనినే త్రికరణశుద్ధి అన్నారు. శంకరులవారియందు ఇది కొట్టొచ్చినట్లుగా కనిపించింది. అద్వైత మంటే ఏమిటి? జ్ఞానమంటే ఏమిటి? అని అనేకమంది పండితులు అనేక రకములుగా ప్రశ్నలు వేశారు. వారందరికీ సరియైన సమాధానము లిచ్చి సంతృప్తి పరచారు శంకరులవారు. ఏకాత్మతత్త్వమే అద్వైతము. అద్వైత దర్శనమే జ్ఞానము. బంగారము ఒక్కటైనా ఆభరణములు అనేకంగా ఉంటున్నాయి. చేతికి పెట్టుకుంటే కంకణ మంటున్నారు, వ్రేలికి పెట్టుకుంటే ఉంగర మంటున్నారు, మెడలో వేసుకుంటే హారము అంటున్నారు, నడుముకు చుట్టుకుంటే వడ్డాణ మంటున్నారు. ఈ రూపనామములు వేరు వేరుగాని బంగారమొక్కటే కదా!

''శృంగారములు వేరు, బంగార మొక్కటే
పశుల వన్నెలు వేరు, పాలు ఒకటే
జీవజాతులు వేరు, జీవుండు ఒక్కడే
పూల జాతులు వేరు, పూజ లొకటే
దర్శనంబులు వేరు, దైవంబు ఒక్కడే''

ఈవిధంగా లోతునకు దిగి విచారిస్తే అంతా ఒక్కటే, ఒక్కటే! ఇంతమంది ప్రజలిక్కడ కూర్చున్నారు. అనేక రూపనామములతో, అనేక భావములతో కూడియున్నారు. కాని అందరిలో నున్నవి పంచభూతములే, అందరూ ఆత్మస్వరూపులే. ఇదే అర్థము వచ్చేటట్లుగా శంకరులవారు ఆ సభలో పండితులకు అద్వైత సిద్ధాంతాన్ని బోధించారు. సమదృష్టిగలవారే పండితులని అన్నారు. ధనదాహము తగదని మందలించారు. కర్మఫలితమే విత్తమనీ, కలిగినంతలో తృప్తి చెందమనీ హితవు చెప్పారు.

*దురాశ దుఃఖానికి చేటు:* ఒక రైతుకు కొంత భూమి ఉండేది. కాని ఇంకా ఎక్కువ భూమిని సంపాదించి జమిందారనిపించుకోవాలని అతనికి ఆశ పుట్టింది. మిత్రుల సలహాపై రాజును కలిశాడు. ''మహారాజా! నాకు కొంత భూమి కావాలి'' అని కోరాడు. ''తప్పక ఇస్తాను నాయనా! నీవు ఉదయం ఏడుగంటలు మొదలుకొని సాయంత్రం ఏడు గంటలలోపల ఎంత భూమిని చుట్టి వస్తావో అదంతా నీకే ఇస్తాను'' అన్నాడు. ఈ రైతు చాల సంతోషించాడు. ఎక్కువ భూమిని సంపాదించు కోవాలనే దురాశతో మరునాడు ఉదయం ఏడు గంటలకు టిఫిన్ కూడా తీసుకోకుండా పరుగెత్తడం

ప్రారంభించాడు. టిఫినేమైనా తీసుకుంటే కడుపు బరువెక్కి పరుగెత్తడానికి వీలుకాదని భావించి ఏమీ తీసుకోలేదు పాపం! కనీసం మంచి నీళ్ళైనా త్రాగకుండా పరుగెత్తాడు. అందువల్ల సాయంత్ర మయ్యేసరికి విపరీతంగా అలసిపోయాడు. తాను బయలుదేరిన చోటుకి ఒక ఇరవై అడుగుల దూరంలో ఉండగా బాగా దాహమైంది. గుండె పట్టింది, క్రింద కూలాడు, ప్రాణం వదిలాడు. అక్కడ గుమి కూడిన ప్రజలందరూ, ''పాపం ఎంతో ఆశతో వచ్చాడు. ఎన్నో వందల ఎకరాలు సంపాదించు కోవాలనుకున్నాడు. కాని అతనికిప్పుడు ఆరడుగులు మాత్రం చాలు'' అనుకున్నారు. దురాశకు పోవడంచేత ఎంత దుర్గతి పట్టింది!

ఒకానొక సమయంలో మిడాస్ అనే శ్రీమంతు డుండేవాడు. అతడు చాల దురాశాపరుడు. డబ్బుకోసం నిరంతరం తన కులదేవతను ప్రార్థించేవాడు. ఒకనాడు ఆ దేవత ప్రత్యక్ష మైంది. ''తల్లీ! నేను ముట్టిందల్లా బంగారం కావాలి'' అని కోరాడు. అప్పుడా దేవత, ''నాయనా! నీవు దురాశతో కోరరాని కోరిక కోరుతున్నావు. దీనివల్ల నీకు సుఖముండదు, చాల బాధలకు గురి కావలసివస్తుంది''అని హెచ్చరించింది. కాని మిడాస్, ''నా అవస్థ నాకుండనీ. ఈ వరం నీవు తప్పక ఇవ్వవలసిందే'' అని పట్టుపట్టాడు. చెప్పిన మాట వినకపోతే ఆమె మాత్రం ఏమి చేయగలదు? ''సరే, ఇచ్చాను వెళ్ళు''అన్నది. మిడాస్ ఎంతో ఆనందంగా ఇంటికి తిరిగి వచ్చాడు. పరుపుపై కూర్చున్నాడు. అది బంగారంగా మారిపోయింది. దిండు తీసి ప్రక్కన పెట్టాడు. అది కూడా బంగారమై పోయింది. తన బిడ్డను పిలిచి, ''అమ్మా! కాఫీనో, టీనో తీసుకురా'' అన్నాడు. బిడ్డ కాఫీ తెచ్చింది. దాన్ని ముట్టేసరికి అది కూడా బంగారమైపోయింది. క్షణక్షణానికి అతనికి ఆకలి పెరిగిపోతున్నది. కాని ఏది తిందామనుకున్నా ముట్టిన తక్షణమే అది బంగారమైపోతున్నది. పొరపాటున తన బిడ్డను ముట్టాడు, బిడ్డ కూడా బంగారు విగ్రహంగా మారిపోయింది. అప్పుడు మిడాస్‌కు బుద్ధి వచ్చి తిరిగి దేవతను ప్రార్థించాడు. ఆమె ప్రత్యక్షమై, ''నాయనా! నా మాటను నీవు వినలేదు. అందుకే నీకీ గతి పట్టింది. సరే, ఇప్పుడు నన్నేమి చేయమంటావు?'' అని అడిగింది. ''తల్లీ! నీ విచ్చిన వరమును తక్షణమే వాపస్ తీసుకో'' అన్నాడు. చూశారా! దురాశ ఎంత ప్రమాదానికి గురి చేస్తుందో! కనుకనే శంకరులవారు, ''వలదు వలదు ధనదాహము నరుడా!''అన్నారు.

***విదేశవ్యామోహాన్ని విడనాడండి:*** మన ఆశలకు ఒక పరిమితి ఉండాలి. ఈనాటి విద్యార్థులు డిగ్రీలు పుచ్చుకున్న తక్షణమే ఇంక అమెరికాకో, స్విట్జర్లాండ్‌కో, ఏ గల్ఫ్‌దేశాలకో పోవాలని వీసాకోసం, పాస్‌పోర్ట్‌కోసం బయలుదేరుతారు. విద్యార్థులారా! భారతదేశంలో లేనిది మరొక దేశంలో లేదు. ఈ దేశము అన్ని దేశములకూ మాస్టర్‌వంటిది. ఇది కర్మభూమి, పుణ్యభూమి, త్యాగభూమి, యోగభూమి. ఇక్కడ మీరు ఏ కొద్దిగా సంపాదించినా శాంతిగా జీవించవచ్చు. ఈ విదేశ ప్రయాణాలకోసం అనవసరంగా కాలమును, కాయమును, కర్మను వ్యర్థం చేయకండి. మీరు పుట్టింది భారతదేశంలో. తినేది భారతదేశపు తిండి, త్రాగేది భారతదేశపు నీరు. ఇట్టి భారతదేశాన్ని వదలుకొని ఏ దేశమో పోయి మీరు సంపాదించేదేమిటి? దురాశలు మానండి, మాతృభూమికి సేవ చేయండి. స్వార్థముతోపాటు పరార్థమును కూడా గుర్తించండి. ఈనాడు అనేకమంది ఏవో పెద్దపెద్ద డిగ్రీలు తీసుకొని విదేశాలకు పోతున్నారు. ఉద్యోగాలు

చిక్కకపోతే హోటల్స్‌లో కప్పులు కడిగి బ్రతుకుతున్నారు. అక్కడ కప్పులు కడిగినా, వీధులు ఊడ్చినా చూసేవారెవరూ లేరు కాబట్టి ఏ పనికైనా సిద్ధపడుతున్నారు. కాని తమ ఇంట్లోనే తాము తిన్న టిఫిన్ ప్లేట్లను కడగటానికి మాత్రం సిగ్గుపడుతున్నారు. ఎందుకు సిగ్గు? మనం తిన్న ప్లేట్లను మనం కడుక్కోవటానికి సిగ్గెందుకు? అనవసరమైన ఆడంబరాలకు పోవడంచేత మన దేశ పవిత్రతను మనమే క్షీణింపజేస్తున్నాము.

విద్యార్థులారా! మీరు మరోలా భావించకూడదుకాని, ఈ భజగోవింద శ్లోకాలలో మీకు విరక్తి కలిగించే విషయాలు అనేకం ఉన్నాయి. పిల్లలకు ఈ సాయిబాబా ఈవిధమైన ప్రబోధలు చేస్తున్నాడే అని ఎవరైనా ఏమైనా అనుకోవచ్చు. అనుకొన్నా భయం లేదు. సత్యం చెప్పడానికి భయమెందుకు? అయినా అంత సులభంగా విరక్తి కల్గుతుందా? ఇంపాజిబుల్! ఆధ్యాత్మిక ప్రబోధలను సంవత్సరాల తరబడి వింటున్న వారిలోనే కించిత్తైనా మార్పు లేదు. అలాంటప్పుడు ఒక్కతూరి విన్నంత మాత్రమున మీలో మార్పు కలుగుతుందా? ఏ గొప్ప అదృష్టవంతులకో అలాంటి మార్పు సంభవిస్తుంది. నిజంగా స్వతస్సిద్ధంగా ఆ వైరాగ్యమే ప్రాప్తిస్తే అంతకంటే మహాభాగ్యమేమున్నది? అందువల్లనే, ''త్యాగే నైకే అమృతత్వ మానశుః'' అని చెప్పాను. త్యాగమునకు ఎవరు పూనుకుంటారో వారు నిజంగా గొప్ప అదృష్టవంతులు. దైవానికి దూరంగా ఉన్నంతవరకు దైవత్వము మీకు అర్థం కాదు. దైవానికి సమీపంగా పోయినప్పుడే మీ జీవిత రహస్యం మీకు చక్కగా అర్థమవుతుంది. అప్పుడు మీలో మీకు తెలియకుండానే వైరాగ్యము పండిపోతుంది. వైరాగ్యము పండటమే కాదు, మనస్సు నిండిపోతుంది, జీవితమే సార్థకమైపోతుంది.

(తేది: ***7.9.96***న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

---

## సాయిరామమ్

*శాంతాకారం కరుణ హృదయం మందహాసం విలాసం*
*శ్రీవత్సాంకం లలిత చుబుకం భూతిహస్తం సమస్తమ్!*
*సౌందర్యాంగం తరళ నయనం కేశజాలం సుచేలం*
*సత్యానందం జనసురతరుం సాయిరామం భజేహమ్*

*- శాంతిశ్రీ (ప్రశాంతి నిలయం)*

---

మానవుడు మృదంగంలో దూరిన చుంచువలె ఉన్నాడు. చుంచు మృదంగానికి ఎడమవైపున దెబ్బ పడితే కుడివైపుకు పరిగెడుతుంది, కుడివైపున దెబ్బ పడితే ఎడమవైపుకు పరిగెడుతుంది. అటులనే మానవుడు పరమాత్మ నుండి ప్రకృతి వైపుకు, ప్రకృతి నుండి పరమాత్మవైపుకు పరిగెడుతున్నాడు.

- బాబా

# వేదము - వేదాంతము

''వేదవేదాంగములు వల్లె వేసియున్న
పద్య గద్యంబులను కూర్ప గలిగియున్న
చిత్తశుద్ధియె లేకున్న చెడును వాడు
మరువబోకుడు ఇదువంటి మంచిమాట''

వేదము ద్వైతమనీ, వేదాంతము అద్వైతమనీ అనేక ఆధారములచేత శంకరులవారు నిరూపించారు. మానవ శరీరమునకు, శరీరములోని అంగములకు ఎంత వ్యత్యాసమో వేదవేదాంతములకు అంతే వ్యత్యాసము. కన్నులు, చెవులు, ముక్కు, నోరు ఇవన్నీ దేహమునకు అంగములు. దేహము సమాజమునకు అంగము, సమాజము మానవత్వమునకు అంగము, మానవత్వము ప్రకృతికి అంగము, ప్రకృతి పరమాత్మకు అంగము. ఈవిధంగా లోతునకు దిగి విచారిస్తే అంతా ఒక్కటే అని స్పష్టమౌతుంది.

ఈనాడు మానవ జీవితము సమస్యల తోరణంగా గోచరిస్తున్నది. నిత్యజీవితంలో మానవునికి చింతలేని సమయమే కనిపించటంలేదు. అయితే సమస్త చింతలను పరిహారం గావించగల శక్తి ఒక్క ప్రేమకు మాత్రమే ఉన్నది. కాని వేదములో ప్రేమకు అంతగా ప్రాముఖ్యత ఇవ్వబడలేదు. వేదము ఆశయాలకు సంబంధించినదే కాని అనుభూతికి సంబంధించినది కాదు. వేద మంత్రాలన్నీ ద్వైతంతో కూడినవి. అనగా, 'నాకు అది కావాలి, ఇది కావాలి' అని ఆశించటం. వాంఛకు మూలం ద్వైతభావమే. ఇక్కడ ఆశించే వ్యక్తి, ఆశింపబడే పదార్థము రెండూ ప్రత్యేకంగా ఉన్నాయి. ఈ రెండింటి ఏకత్వమే అద్వైతము.

**ప్రత్యక్షము - పరోక్షము:** షడ్రసోపేతమైన ఆహారమును భుజించిన మూగవానిని పదార్థముల రుచి చెప్పమంటే ఏమని చెప్పగలడు? అదేవిధంగా అద్వైతములోని ఆనందము అనుభూతికే అర్థమవుతుందిగాని వివరించి చెప్పడానికి వీలుకాదు. దీనికి ప్రత్యక్షము, పరోక్షము అనే రెండు ప్రమాణము లున్నాయి. పరోక్షమే లేకుండిన ప్రత్యక్షము శూన్యము. కాని దురదృష్టవశాత్తు ఈనాటి ప్రజలు ప్రత్యక్షమునకే విలువనిస్తూ పరోక్షమును విస్మరిస్తున్నారు. ఇక్కడ ఇసుగడ్డ ఉన్నది. ఇది ప్రత్యక్ష ప్రమాణము. అయితే దీనికి ఆధారమైన జలము పరోక్షంగా ఉన్నది. పరోక్షమైన జలము లేక ప్రత్యక్షమైన ఇసుగడ్డ లేదు. అదేవిధంగా దృశ్య కల్పితమైన ఈ జగత్తుకు పరోక్షమైన దివ్యత్వమే ఆధారంగా ఉన్నది. ఇట్టి మూలాధార తత్వాన్ని ప్రజలకు వివరించే నిమిత్తమై శంకరులవారు అనేక శ్రమలు పడ్డాడు. గురువైన గౌడపాదుడు కూడా ఇతనికి తగిన ఉత్సాహ ప్రోత్సాహముల నందిస్తూ వచ్చాడు. వయస్సు చిన్నదైనప్పటికీ శంకరులవారి సంకల్పము చాల దృఢమైనది. 16 సం॥ల వయస్సు నందే అనేకమంది పండితులతో వాదోపవాదములు సల్పి వారందరినీ అద్వైతమతములో ప్రవేశపెట్ట గలిగాడు.

**సర్వం బ్రహ్మమయం:** అద్వైత మనగా ఏమిటి? అన్నింటి ఏకత్వమే అద్వైతము. మిఠాయి అంగడిలో పిల్లలను ఆకర్షించడానికి చక్కెరతో నక్క, కుక్క, ఏనుగు మొదలైన బొమ్మలను చేసి అమ్ముతుంటారు పిల్లలు ఆ బొమ్మలను చూసి ఆకర్షింపబడతారు

ఒకడు తనకు నక్క కావాలంటాడు, మరొకడు కుక్క కావాలంటాడు. ఈ నక్క, కుక్కల రూప నామములు వేరుగాని రెండింటియందున్న చక్కెర ఒక్కటే! నక్క చెవిని త్రుంచి నోట్లో వేసుకున్నా తీయగానే ఉంటుంది, దాని తోకను త్రుంచి నోట్లో వేసుకున్నా తీయగానే ఉంటుంది. ఎందుకంటే దాని స్వరూపమంతా చక్కెరమయమే! అదేవిధంగా ఈ జగత్తంతా బ్రహ్మమయమే! ''ఈశావాస్య మిదం జగత్'', ''ఈశ్వర స్సర్వ భూతానాం.'' దైవత్వము సర్వత్ర ఉన్నదనే సత్యాన్ని గుర్తించి ప్రబోధిస్తూ వచ్చారు శంకరులవారు.

*భక్తుడు – బంగారు వ్యాపారి:* ఒక శ్రీమంతుడు ఒక కృష్ణవిగ్రహాన్ని చేయించుకొని నిత్యము దానికి అభిషేకం చేయాలని సంకల్పించుకున్నాడు. ఒక కంసాలివద్దకు వెళ్ళి 20కాసులతో కృష్ణుణ్ణి, 20కాసులతో గోవును, 20కాసులతో అభిషేకం చేయడానికి ఒక బంగారు కప్పును చేయించుకున్నాడు. ప్రతినిత్యము కృష్ణవిగ్రహానికి అభిషేకం చేసి తీర్థమును గ్రోలి ఆనందించేవాడు. కాని కాలము ఎల్లప్పుడు ఒకేవిధంగా ఉండదు కదా! ''ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు?'' కొంతకాలానికి ఇతని ఆర్థిక పరిస్థితి దిగజారి పోయింది. కడపటికి దినం జరగడం కూడా కష్టం కావడంతో ఇంక భరించుకోలేక ఈ విగ్రహాలను అమ్మి డబ్బు తేవాలని ఒక బంగారువ్యాపారి ఇంటికి వెళ్ళాడు. ఆయన మొట్టమొదట అభిషేకం చేసే గిన్నెను తూకం వేశాడు. ''ఇది 20కాసులు, దీనికి 60,000 రూపాయలు'' అన్నాడు. తరువాత గోవును తూకం వేశాడు. దాని వెల కూడా 60,000 రూపాయలన్నాడు. చివరిగా కృష్ణవిగ్రహాన్ని తూకం వేసి, దానికి కూడా 60,000 రూపాయ లిస్తానన్నాడు. దానితో ఇతనికి కోపం వచ్చింది. ''ఏమిటిది? కృష్ణునికి, గోవుకు, కప్పుకు ఒకే వెలనా? నేను భరించలేను. కృష్ణునికి ఎక్కువ వెల ఇవ్వాలి'' అన్నాడు. అప్పుడా వ్యాపారి, ''అయ్యా! నీవు రూపమును చూస్తున్నావు, నేను బంగారమును చూస్తున్నాను. నేను విలువ ఇచ్చేది బంగారమునకేగాని రూపనామములకు కాదు'' అన్నాడు. ఈనాటి మానవుడు కూడా కేవలం రూపనామములను మాత్రమే చూస్తున్నాడుకాని అందరియందు ఏకత్వంగా ఉన్న పంచభూతముల పరతత్త్వమునకు విలువ నివ్వటం లేదు. ఈ పరతత్త్వమే అద్వైతము. ప్రతి మానవునియందు ఈ పంచభూతములు తప్ప మరొకటి లేనే లేదు.

*ప్రకృతి ఒక నిలువుటద్దము:* నీవొక నిలువుటద్దము ముందర నిలబడినప్పుడు నీ ప్రతిబింబము నీకు కనిపిస్తుంది. దానికి నీవు నమస్కరిస్తే అది కూడా నీకు నమస్కరిస్తుంది. దానిని నీవు దండిస్తే అది కూడా నిన్ను దండిస్తుంది. అదేవిధంగా ఈ ప్రకృతిలో ఎట్టి కర్మలు చేస్తావో అట్టి ఫలితమే నీకు వస్తుంది. ప్రకృతియే ఒక నిలువుటద్దము, బింబమే దైవత్వము. అద్దము లేక ప్రతిబింబము లేదు. అనగా ప్రాకృతభావమును విసర్జిస్తే ఉన్నది ఒక్కటే. ఇదే సృష్టిలోని విచిత్రము. అయితే ప్రాకృతమైన దృష్టితో చూస్తే ఇక్కడ నీవు, అద్దము, ప్రతిబింబము అనేవి మూడు ఉన్నాయి. మూడులో ఒకటి పోతే ఎంతని అడిగితే ఫస్ట్‌స్టాండర్డ్ పిల్లవాడైనా 'రెండు' అని సమాధానం చెబుతాడు. కాని దైవము దీనిని అంగీకరించడు, 3-1=1 అంటాడు. ''భగవంతుడు ఏ స్కూల్లోను చదువుకోలేదో ఏమిటో! ఇతనికి మేథమెటిక్స్ తెలియదు!'' అని నీవనుకోవచ్చు. కాని

భగవంతు డేమంటాడు? ''పిచ్చివాడా! ఇక్కడ నీవు, నీ ప్రతిబింబము, అద్దము మూడూ ఉన్నాయి. అద్దమును తీసివేయ్, దానితోపాటు ప్రతి బింబము కూడా పోతుంది. అప్పుడు మిగిలేది బింబము ఒక్కటే కదా!'' ఇదే శంకరులవారు బోధించిన ఏకత్వము. అల్లా అని చెప్పండి, జీసస్ అని చెప్పండి, బుద్ధా అని చెప్పండి, జోరాష్టర్ అని చెప్పండి, రామా అని చెప్పండి, - అంతా చేరి ఒక్కటే. దీనికి ఒక చిన్న ఉదాహరణ: ఒక ఇంటి యజమాని ఉన్నాడు. ఆయన భార్య వచ్చి, ''మై డియర్ హస్‌బెండ్!'' అని పిలుస్తుంది. మనుమడు, ''మై డియర్ గ్రాండ్ ఫాదర్'' అంటాడు. కుమారుడు, ''మై డియర్ ఫాదర్'' అంటాడు. ఈవిధంగా ఒక్కొక్కరు ఒక్కొక్క రకమైన సంబంధము పెట్టుకోవడంచేత ఇన్ని పేర్లు ప్రారంభమైనాయికాని, యజమాని ఒక్కడే కదా!

*అద్వైతభావనవల్లనే ఆనందప్రాప్తి:* అనేకమంది, ''ఓ భగవంతుడా! నీవే నా తల్లివి, నీవే నా తండ్రివి, నీవే నా మిత్రుడవు, నీవే నా గురువు, నీవే నా బంధువు'' అని పర్షిస్తుంటారు. భగవంతునితో ఇటువంటి లౌకికసంబంధాలు పెట్టు కోవడం చాల పొరపాటు. శంకరులవారు దీనిని ఖండించారు. ''భగవంతుడా! నీవు నా తండ్రివి'' అనుకున్నప్పుడు తండ్రి తండ్రిగానే ఉంటాడు, కుమారుడు కుమారుడుగానే ఉంటాడు. దీనివల్ల ప్రయోజనం లేదు, రెండింటి ఏకత్వము జరగాలి. నీవు నేనే, నేను నీవే, ఇరువురము ఒక్కటే అనే భావన కల్గాలి. ఇదే అద్వైతము. ఇట్టి అద్వైత భావనవల్లనే ఆనందము ప్రాప్తిస్తుందని శంకరులవారు ప్రబోధించారు. అయితే ఇది అంత సులభం కాదు. దీనికి అనేక రకములుగా విచారణ చేయాలి. దీనికి తగిన సంస్కారము కూడా ఉండాలి. సంస్కారము పరిపక్వమైనప్పుడే అద్వైతభావన కల్గుతుంది. ఇటువంటి భావన కల్గినవాడు నిజంగా ఎంతటి అదృష్టవంతుడో! అతడిని మించిన అదృష్టవంతుడు మరొకడు లేడు. అతడే ఆత్మ సామ్రాజ్యమునకు రాజు, రాజులకే రాజు. అమృత తుల్యమైన అద్వైతాన్ని గుర్తించలేనివారే విషతుల్యమైన లౌకిక విషయాలకోసం ప్రాకులాడు తుంటారు.

*అర్జునుని అనన్యభక్తి:* అమావాస్య దినమున మహా భారత యుద్ధము ప్రారంభం కావలసియుండగా చతుర్దశినాడు కృష్ణార్జునులు యుద్ధమునకు చేయవలసిన ఏర్పాట్లను గూర్చి చర్చించుకుంటూ నడుస్తున్నారు. భగవంతుడు తన అనుగ్రహాన్ని అందించే ముందుగా వ్యక్తి యొక్క అర్హతను పరీక్షిస్తాడు. ఆ సమయంలో కృష్ణుడు కూడా అర్జునుని పరీక్షించదలచి, ''అర్జునా! ఆ చెట్టు పైనున్నది నెమలే కదా!'' అన్నాడు. ''అవును స్వామీ! అది నెమలే'' అన్నాడు అర్జునుడు. ''పిచ్చివాడా! అది నెమలి కాదు, గరుడపక్షి'' అన్నాడు కృష్ణుడు. ''అవును స్వామీ! అది గరుడపక్షే'' అన్నాడు అర్జునుడు. వెంటనే కృష్ణుడు కోపాన్ని నటిస్తూ, ''ఏమిటి అర్జునా! నేను ఏది చెపితే దానిని ఒప్పుకుంటున్నావు. ఇది సత్యమా కాదా అనే విచారణ అక్కర లేదా? విచక్షణాజ్ఞాన శూన్యుడవైన నీవు యుద్ధం ఎలా చేయగలవు?'' అన్నాడు. అర్జునుడు, ''కృష్ణా! అది నెమలి కాదని నేనంటే నీవు దానిని నెమలిగా మార్చవచ్చు, అది గరుడపక్షి కాదంటే నీవు దానిని గరుడునిగా మార్చవచ్చు. కాబట్టి అదేమిటనే విచారణ నాకు అక్కరలేదు. నీ వాక్కే నాకు సత్యము'' అన్నాడు. అప్పుడే చెప్పాడు కృష్ణుడు, ''అర్జునా! ఇప్పుడు

నీవు నా భక్తుడవు'' అని. దీని తరువాతనే అతనికి గీతను బోధించాడు.

**ఎఱుక – మరుపు:** యుద్ధసమయంలో అర్జునుని వయస్సు 84 సం॥లు, కృష్ణుని వయస్సు 86 సం॥లు. అంతవరకు అర్జునునికి ఏనాడూ గీతను బోధించలేదు, అసలు అతనితో వేదాంతమే మాట్లాడలేదు. కాల కర్మ కారణ కర్తవ్యములు కలసివచ్చినప్పుడే దైవానుగ్రహం లభిస్తుంది. యుద్ధంలో అప్పటి కప్పుడు వేదాంతమును ప్రారంభించాడు. ''అర్జునా! వీరంతా నీ బంధు మిత్రులని భావిస్తున్నావు. కాదు, కాదు. నీవు, నేను, వీరు, వారు అంతా ఒక్కటే'' అన్నాడు. ఈ మాటలు విని అర్జునునికి మరింత మతిపోయింది. ''అంతా ఒక్కటైతే యుద్ధమే అనవసరం కదా!'' అన్నాడు. ''పిచ్చివాడా! అది నాకు తెలుసు, నీకు తెలియదు. నేను ఎఱుకలో ఉన్నాను, నీవు మరుపులో ఉన్నావు'' అన్నాడు కృష్ణుడు.

''ఎఱుక, మరుపనకుండ నిరతము
జాగ్రత్స్వప్న సుషుప్తిలో అరమరలు
లేకుండ ఎప్పుడు తరచుగ జీవాత్మ
చదివెడి తారకము సూటెరుగవలెనన్నా
సద్గురుని కృపచే తారతమ్యము లెరుగవలెనన్నా''

'సోహం' (నేనే దైవం) అనేదే ఆ తారక మంత్రము. ''ఇది తెలిసినవాడను నేను, తెలియనివాడవు నీవు. ప్రస్తుత దేహసంబంధమును మాత్రమే నీవు చూస్తున్నావు. గతము (Past) నీకు తెలియదు. తెలుసుకానీ మర్చిపోయావు'' అన్నాడు. ''స్వామీ! నీకు మాత్రమే తెలుసంటున్నావు. మరి నాకెందుకు తెలియటం లేదు?'' అని అర్జునుడు ప్రశ్నించాడు. ''అర్జునా! నీవు ప్రాకృతమైన దృష్టితో చూస్తున్నావు. కాబట్టి నీకు మరుపు వచ్చింది. నేను నివృత్తి పరమైన దృష్టితో చూస్తున్నాను. కాబట్టి నాకెల్లప్పుడు ఎఱుకగానే ఉంటుంది'' అన్నాడు. దీనికొక చక్కని ఉదాహరణ చెప్పాడు. అయితే మీకు అర్థం రావాలని పేర్లను మార్చి చెబుతున్నాను. ఒకానొక సమయంలో రాముడు కాశ్మీర్‌కు వెళ్ళినప్పుడు అక్కడ చాల చౌకగా చిక్కిందని ఒక సూటుగుడ్డ కొన్నాడు. దానిని తీసుకువచ్చి అమ్మకు ఇవ్వగా ఆమె దానిని బీరువాలో పడవేసింది. అందరూ దాని సంగతే మర్చిపోయారు. పది సంవత్సరముల తరువాత ఒకనాడు ఏదో సర్దుతుంటే ఆ గుడ్డ కనిపించింది. ''బాబూ రామా! నీవు తెచ్చుకున్న గుడ్డ ఇక్కడే ఉన్నది, దీనిని కుట్టించుకో'' అని ఇచ్చింది. రాముడు దానితో షర్టు కుట్టించు కున్నాడు, తన పుట్టినరోజున ధరించాడు. తరువాత అమ్మ ఇచ్చిన స్వీటును తమ్మునికి అందించాలని కాస్త వంగేటప్పటికి షర్టు చినిగి పోయింది. తల్లి వెంటనే, ''నాయనా! క్రొత్త షర్టు అప్పుడే చినిగిపోయిందేమిటి?'' అన్నది. రాముడు, ''అమ్మా! షర్టు క్రొత్తదేగాని బట్ట చాల ఓల్డ్ స్టాక్! నీవు మరచిపోయావు. నేను ఎఱుకలో ఉన్నాను'' అన్నాడు.

**భగవంతుడు గతాన్ని కూడా చూస్తాడు:** యుద్ధంలో అనేకమంది మరణించారు. అర్జునునికి చాల బాధ కలిగింది. కృష్ణునితో, ''నాకంటే చిన్న వాడైన అభిమన్యుడు ముందు పోవడ మేమిటి? నేను పెద్దవాడను. కాబట్టి నేనే ముందు పోవాలి కదా!'' అన్నాడు. అప్పుడు కృష్ణుడు, ''పిచ్చివాడా! ఎవరు ముందో, ఎవరు తరువాతో చెప్పడానికి వీలుకాదు. ఎవరి కాలం ఎప్పుడు తీరుతుందో అప్పుడు పోక తప్పదు'' అన్నాడు.

''పోకన్మానదు దేహ మెవ్విధమునన్
పోషించి రక్షించినన్

రాకన్మానవు హానివృద్ధులు
మహారణ్యంబునన్ దాగినన్''

ఇది జన్మాంతర సంబంధముపై ఆధారపడి ఉంటుంది. ఒక 25 సం॥ల యువకుడు ఒక రాయిపై సుత్తితో 20వేట్లు కొట్టాడు. కాని అది పగల లేదు. తరువాత ఒక వృద్ధుడు వచ్చి దానిపై రెండు వేట్లు వేయగానే అది రెండు ముక్కలై పోయింది. ''నీవు 20వేట్లు కొట్టినా అది పగల లేదు. నేను రెండు వేట్లకే పగలకొట్టాను చూడు'' అన్నాడు గర్వంగా. అప్పుడా యువకుడు, ''ఇంతమాత్రమునకే గర్వించకు. నిజం చెప్పాలంటే నీవు కొట్టిన రెండు వేట్లకు అది పగల లేదు. ఇంతకు ముందు నేను 20వేట్లు కొట్టాను. కాబట్టి అది పగిలింది 22వ వేటుకే'' అన్నాడు. మనం ప్రస్తుతమును మాత్రమే చూస్తాము. కాని భగవంతుడు గతాన్ని కూడా చూస్తాడు. ఇదే మానవత్వానికి, దివ్యత్వానికి ఉన్న వ్యత్యాసము.

(తేది: *8.9.96*న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

---

## ఇవే ఆ పాదములు...

ఆదిశేషుని మీద హాయిగా పవళింప శ్రీదేవి యొత్తెడు పాదములివి
అర్ధనారీశ్వరుండై వెండికొండపై తాండవంబాడు పాదాలివేను
ఆకాశమును కప్పి, అసుర కులవిభుడు, బలితల మోపిన పాదములివి
గౌతమ ముని పత్ని కల్మషమ్ము కడిగి మోదమ్ము కూర్చిన పాదములివి
నావ నాతిగ మారు నను నెపాన గుహుడు బాగుగా కడిగిన పాదములివి
ఆంజనేయుడు ప్రేమ ననవరతములోన పట్టియుంచిన దివ్యపాదములివి
శరణాగతిన్ విభీషణు డార్తితో వచ్చి భక్తితో పట్టిన పాదములివి
కాళీయు గర్వమ్ము కక్కించి కాపాడ పడగపై యాడిన పాదములివి
బ్రహ్మ కడిగిన మెత్తని పాదములివి - పరమపావని కన్నట్టి పాదములివి
వేదనాదము వెలయించు పాదములివి - బాధలను బీల్చి చెండాడు పాదములివి
పరమ పదమిచ్చి బ్రోచెడు పాదములివి - పతితు నుద్ధార మొనరించు పాదములివి
భక్తహృదయ విరాజిత పాదములివి - ఇవియె సత్యసాయి పదము లివిగో, కనుడు.

-పలివెల సుబ్బారాయుడు (హైదరాబాదు)

---

రాత్రిపూట చలి ఎక్కువగా ఉన్నప్పుడు కంబళిని దగ్గరకు చేర్చుకొని గట్టిగా కప్పుకుంటాము. అదేవిధంగా కష్టములు కలిగినప్పుడు నామమనే కంబళితో మనస్సును కప్పండి.

-బాబా

# ఆత్మదృష్టిని అలవర్చుకోండి

''సాధుజనులను చూసి చౌక చేతురు
వారికేమి కొదువ వసుధయందు?
కుంజరమును చూసి కుక్క లెన్నొ మొరుగు
దాని ఘనత కేమి తక్కువగును?''

దివ్యాత్మస్వరూపులారా! ఈ జగత్తులో ప్రతి పదార్థము ఏదో ఒక రంగుతో గోచరమవుతున్నది. ఒక్కొక్క పదార్థమునకు ఒక్కొక్క రంగు సహజమని భావిస్తున్నాము. కాదు, కాదు. మన దృష్టియే ఈ రంగులకు మూలకారణం. ఆకాశము నీలంగా ఉంది, సముద్రము నీలంగా ఉంది అంటాము. ఇది చాల తప్పు. ఆకాశము అత్యంత దూరంగా ఉండటంచేత అది నీలి రంగుతో కనిపిస్తుంది. సముద్రము కూడా అత్యంత లోతుగా ఉండటంచేత నీలిరంగుతో కనిపిస్తుంది. కాని దగ్గరకు వెళ్ళి ఆ నీటిని చేతిలో తీసుకున్నప్పుడు దానికి ఏ రంగూ ఉండదు. అదే విధంగా ఈ జగత్తులో మనకు గోచరమయ్యే మంచిచెడ్డలన్నీ మన భావముపైనే ఆధారపడియున్నవి. నీటి నుండి కరెంటు పుడుతున్నది. దానిని అనేక విధములుగా మనం ఉపయోగించుకుంటున్నాము. కాని కరెంటు మాత్రం కంటికి కనిపించదు కదా! అదేవిధంగా సమస్త జీవులూ ఆత్మతత్త్వమునుండియే ఆవిర్భవిస్తున్నాయి. జీవుల మంచిచెడ్డలు, జీవుల ప్రవర్తనలు మన కంటికి కనిపిస్తున్నాయి. కాని ఆత్మ మాత్రం కంటికి కనిపించదు.

***శంకరులవారు తల్లి కిచ్చిన మాట నిలబెట్టుకొనుట:*** అద్వైతసిద్ధాంతము కాశీలో నలుదిశల ప్రాకిపోయింది. ఒకనాడు శంకరుని ప్రసంగాన్ని వినడానికి వేలాది ప్రజలు, పండితులు గుమిగూడారు. ఒక్కతూరి కన్నులు మూసుకున్నారు శంకరులు. కాలడిలో కొనఊపిరితో ఉన్న తన తల్లి కనిపించింది. ఇల్లు వదిలే సమయంలో, ''నాయనా! నీవు ఇల్లు వదలి పోతున్నావు. నాకిష్టం లేకపోయినా సన్న్యాసం స్వీకరించావు. కనీసం నా అంత్య సమయంలోనైనా నీవు నా దగ్గర ఉండాలి''అని ఆమె కోరింది కదా! శంకరుడు చిత్తశుద్ధి కల్గినవాడు కనుక తన వాగ్దానమును నిలబెట్టుకోవాలని సంకల్పించుకున్నాడు. చిత్తశుద్ధి కల్గినవారు ఏది చెప్పినా సత్యమే అవుతుంది. శంకరుడు అప్పటి కప్పుడు సభను నిలిపివేసి కాలడికి వెళ్ళాడు. తల్లి కన్ను మూయడానికి పూర్వమే అక్కడ ప్రత్యక్షమై ఆమె నోటిలో తులసీతీర్థము పోసి ఆమె కిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకొన్నాడు.

***ఇంటి పెరట్లోనే అంత్యక్రియలు :*** ఆర్యాంబకు దహనసంస్కారము చేయడానికి ఆ గ్రామంలో శంకరులవారికి సహాయం చేసేవారే లేకపోయారు. సన్న్యాసియైనవాడు కర్మకాండలో ప్రవేశించడం ధర్మవిరుద్ధమనీ, శంకరాచార్యులు ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడనీ భావించి అతని తల్లిదేహాన్ని స్మశానమునకు తీసుకుపోవడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. నంబూద్రి బ్రాహ్మణులు ముట్టడానికి కూడా వీలుకాదన్నారు. విధి లేక తల్లిదేహమును తానే భుజముపై వేసుకొని తన ఇంటి పెరటిలోనే గుంతత్రవ్వి అక్కడే పూడ్చిపేశాడు. ఈనాటికీ కేరళలో ఎవరింట్లోనైనా

పెద్దలు మరణిస్తే వారిని ఇంటి పెరటిలోనే పూడ్చి పెట్టడం జరుగుతోంది. మీరు కేరళకు పోయి చూచినారంటే రోడ్డు పొడవునా ఇళ్ళు ఉంటాయి, వాటి వెనుకభాగం ఖాళీగా ఉంటుంది. శంకరులవారు తన తల్లికిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చుకొని తిరిగి కాశీకి వెళ్ళిపోయారు. కాలడిప్రజలు తనపై చూపిన ద్వేషభావానికి ఆయన మనస్సులో జుగుప్స కలిగింది.

*సన్న్యాస మనగా ఏమిటి? :* ఆనాటి పరిస్థితులను బట్టి కాలడిప్రజలు శంకరులవారు తన తల్లికి అంత్యక్రియలు చేయడాన్ని వ్యతిరేకించారు. ఎందుచేతనంటే సన్న్యాసియైనవాడు కర్మకాండలో ప్రవేశించకూడదు. అసలు సన్న్యాసమనగా ఏమిటి? సమస్త ఆశలను త్యజించడమే సన్న్యాసము. విద్యార్థులకు అర్థమయ్యే నిమిత్తమై నేను కొంచెం లోతుగా వివరించవలసి వస్తున్నది. సన్న్యాసము స్వీకరించేవారు మొట్టమొదట విరజాహోమము చేస్తారు. అనగా తాము మరణించినట్లు భావించి తమ శ్రాద్ధకర్మలు తామే చేసుకొని నూతనమైన నామమును, నూతనమైన వేషమును ధరిస్తారు. పూర్వపు రూపము పోతుంది, పూర్వపు నామము కూడా పోతుంది, క్రొత్తపేరు వస్తుంది. లోకానంద, నాగానంద అని తమ పేరు చివర ఆనందాన్ని తగుల్చుకుంటారుకాని, వారిలో కించిత్తైనా ఆనంద ముండదు! ఈవిధంగా విరజాహోమంలో తమ తద్దినమును తామే పెట్టుకున్న తరువాత ఇంక తల్లి ఎక్కడ! తండ్రి ఎక్కడ! కనుకనే సన్న్యాసికి ఎవరితోను సంబంధ ముండకూడదు, తాను కర్మకాండలో ప్రవేశించకూడదు.

*భగవంతునితో తీర్థయాత్ర :* ఒక చిన్న ఉదాహరణ మీకు చెబుతున్నాను. బూర్గులరామకృష్ణారావు గొప్ప భక్తుడు, 12భాషలు తెలిసిన వ్యక్తి. ఆయన ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా ఉన్నప్పుడు స్వామితో బదరీనాథ్, కేదార్‌నాథ్, అమర్‌నాథ్ యాత్రలు చేయాలని ఆశించాడు. సాక్షాత్ భగవంతునితోనే ఇట్టి పవిత్రయాత్రలు చేయడం తన అదృష్టమని భావించాడు. స్వామి వెళుతున్నాడని తెలిసి అనేక ప్రాంతముల నుండి సుమారు 200మంది నాతో వచ్చారు. రామకృష్ణారావు దంపతులు చాల పవిత్ర హృదయులు. మొదట ఈ రెండువందలమందికి కూడా భోజనం పెట్టి తరువాతనే తాము భుజించేవారు. రామకృష్ణారావు అందరికీ జగ్గులో నీరు పోసేవాడు. ఆయన అంగరక్షకులు వచ్చి, ''సార్! మీరు కూర్చోండి, మేము చేస్తాం'' అంటే, ''నేను స్వామిదాసుడను. గవర్నర్‌ను కాను'' అనేవాడు.

*శ్రీవారు – స్వామిశివానంద :* నేను ఋషీకేశ్‌లోని గెస్టుహౌస్‌లో దిగాను. మిగిలిన రెండువందలమందికి రామకృష్ణారావు వసతి ఏర్పాటు చేశాడు. ఆనాడు స్వామిశివానంద, వారిశిష్యులు గెస్టుహౌస్‌కు వచ్చి, ''రేపు శివానందులవారి 70వ బర్త్ డే. కాబట్టి స్వామి తప్పక రావాలి'' అని కోరారు. నేను, ''ఇది శివానంద బర్త్‌డే కాదు, కుప్పుస్వామి బర్త్‌డే'' అన్నాను. శివానంద పేరుతో సన్న్యాసము తీసుకోక పూర్వము ఆయన పేరు డా॥కుప్పుస్వామి. సన్న్యాసము తీసుకోవడంతో ఆ కుప్పుస్వామి 'చనిపోయాడు', ఆ వేషమే మారిపోయింది. అప్పుడే తాను శివానంద అని పేరు పెట్టు కున్నాడు. అది జరిగి అప్పటికి 26 సం॥లు అయినది. కాబట్టి, 'కుప్పుస్వామికి 70 ఏళ్ళు. శివానందకు 26 ఏళ్ళు' అని అన్నాను. అప్పుడు శివానంద, ''స్వామీ! ఈ దేహానికి 70 ఏళ్ళు పూర్తి యైనవి. కాని ఇంతవరకు ఎవ్వరూ ఈవిధంగా నన్ను సుత్తితో కొట్టియుండలేదు'' అన్నాడు.

పుట్టినది మొదలు దేహము గిట్టునంత వరకు ఒకే రూపము, ఒకే నామమనేది కేవలం దైవమునకు, అవతారములకు తప్ప అన్యులకు సాధ్యం కాదు.

*రామకృష్ణారావు వినయవిధేయతలు:* రామకృష్ణారావు హృదయం ఎలాంటిదో మీరు గుర్తించాలి. ఆయన ఆంధ్రప్రదేశ్ చీఫ్‌మినిష్టర్‌గా హైదరాబాద్‌లో ఉన్నప్పుడు స్వామి ఒక పర్యాయం మలక్‌పేట వెళ్ళారు. స్వామిదర్శనంకోసం వేలాదిమంది క్యూలో నిలబడ్డారు. ఒకరి తరువాత ఒకరు దర్శనం చేసుకోవాలి. క్షణం కూడా ఆలస్యం చేయకూడదని వాలంటీర్లు తిరుపతిలో మాదిరి, 'వెళ్ళండి, వెళ్ళండి' అని తరుముతున్నారు! రామకృష్ణారావు కూడా క్యూలో నిల్చున్నాడు. ఐ.జి.పి.వచ్చి, ''సార్! మీరు చీఫ్‌మినిష్టర్ కాబట్టి క్యూలో నిలబడకూడదు, ముందుకు రండి'' అన్నాడు. అప్పుడాయన, ''రాజకీయంగా నేను చీఫ్‌మినిష్టర్‌ను కావచ్చు. కాని ఆధ్యాత్మికంగా నేను చీప్ డివోటీని. నాకింకా అంత భక్తి రాలేదు'' అన్నాడు. అంతటి గొప్ప హృదయం బూర్గుల రా

*యువతరానికి మేలుకొలుపు:* ఆ రోజులలో శంకరులవారు కాశీకి వెళ్ళాలంటే రాత్రింబవళ్ళు నడుచుకుంటూ పోవలసివచ్చేది. ఆనాడు టార్చిలైటు లేదు. కాబట్టి ఒక కఱ్ఱకు నిప్పు అంటించుకొని ఆయిల్ పోసుకొని ప్రయాణం చేసేవారు. ఒకపర్యాయం శంకరులవారు తన శిష్యులతోకూడి ప్రయాణమై వెళుతున్నప్పుడు పగటి సమయంలో యువతీయువకులు కలసి తిరగడం కనిపించింది. అప్పుడు తన శిష్యులను చూసి, ''ఈనాటి యువతీయువకులు మలమూత్రదుర్గంధ మాంస రక్తములతో కూడిన దేహసౌందర్యముచేత ఆకర్షింప బడుతున్నారేగాని దివ్యమైన ఆత్మతత్వాన్ని గూర్చి ఎవ్వరూ విచారణ చేయటం లేదు. క్షణములో మారిపోయే దేహముపై ఇంత భ్రాంతియా? ఛీ, ఇది సరియైనది కాదు. యౌవనము కదలిపోయే మేఘమువంటిది. ఈ శరీరములన్నీ రాలిపోయేవే, కట్టకడపటికి కాలిపోయేవే! కాబట్టి యువకులైన మీరు ఇట్టి ఆకర్షణలకు లోనుకాక అతి జాగ్రత్తగా మెలగాలి. శరీరదృష్టిని విస్మరించాలి'' అని బోధించాడు. దీనికొక చిన్న కథ ఉన్నది.

*ఎనిమిదిపాత్రలలో' అందచందాలు:* ఒక మహారాజుకు ఏకైక కుమారుడున్నాడు. అతనికి యుక్తవయస్సు వస్తూనే వివాహము చేయాలని సంకల్పించు కున్నాడు. ఆ రాజకుమారుడు తనకు కావలసిన కన్యను తానే సెలెక్ట్ చేసుకోవాలనుకున్నాడు. ఒకనాడతడు గుఱ్ఱముపై గంగానదీ తీరంలో వాహ్యాళికి బయలుదేరాడు. అదే సమయంలో ఒక కన్య తన చుట్టూ పరదా కట్టుకొని దానిని నలుగురు చెలికత్తెలు పట్టుకోగా మధ్యలో నడుస్తూ గంగానదిలో స్నానానికి వెళుతున్నది. ఆమె ఎంతటి పవిత్రురాలంటే పుట్టినప్పటి నుండి మగవారి ముఖం కూడా చూడలేదు. తన జీవితాన్ని భగవదర్పితంగావించుకోవాలనే పవిత్ర సంకల్పంతో ఉండినది. నది ఒడ్డు మీద వెళుతున్న రాజకుమారుడు ఆ అమ్మాయి ముఖం చూశాడు. ఇంక అతనికి ప్రారంభమైంది వ్యాధి! వెంటనే గుఱ్ఱాన్ని 'రివర్స్' చేశాడు. ఆ కన్యను గూర్చి ఎంక్వైరీ ప్రారంభించాడు. తాను స్వయంగా తండ్రికి చెప్పడానికి భయపడి మంత్రులచేత చెప్పించాడు. ఆమె అదే రాజ్యంలోని ఒక వ్యాపారి యొక్క ఏకైక పుత్రిక. ''నా కుమారుడు నీ కుమార్తెను వివాహమాడుటకు ఇష్టపడుతున్నాడు'' అని మహారాజు ఆమెతండ్రికి కబురు పంపాడు.

ఆ వ్యాపారి, ''రాజకుమారుడే నా అల్లుడుగా వస్తున్నాడు. ఇంతకంటే అదృష్టమేమిటి!'' అని చాల ఆనందించాడు. ఈ విషయాన్ని కుమార్తెతో ప్రస్తావించాడు. ఆమె, ''నాన్నా! నేను వివాహ మాడకూడదని ఏనాడో నిర్ణయించుకున్నాను. ఇదే మాటను రాజుకు చెప్పండి'' అన్నది. రాజుకు ఈ విషయం తెలిసి ఉగ్రుడయ్యాడు. ''నేను మహారాజును. బలవంతంగానైనా ఆమెను నా కుమారుని కిచ్చి వివాహం చేస్తాను'' అని బెదిరించాడు. అక్కడ రాజకుమారుని కేమో ఆమెతో వివాహం ఎప్పుడెప్పుడు జరుగుతుందా అని టైఫాయిడ్ ఫివర్ మాదిరి 'టెంపరేచర్' పెరిగిపోతున్నది. ఈ వ్యాపారికి దిక్కు తోచ లేదు. ఏ నిమిషంలో సిపాయిలు వచ్చి తన బిడ్డను ఎత్తుకుపోతారో ఏమో అని చాల బాధపడుతున్నాడు.

ఆమె మరునాడు సాయంకాలము గంగకు పోయి స్నానం చేసి వచ్చి మెడిటేషన్‌లో కూర్చుంది. ''ఓ భగవంతుడా! నా ప్రతిజ్ఞకు భంగం కలుగకుండా, రాజు అసంతృప్తి పడకుండా, నా తండ్రికి చింత లేకుండా ఏదైనా మార్గం చూపించు'' అని ప్రార్థించింది. ఆమె హృదయ పూర్వకంగా చేసిన ప్రార్థనను భగవంతుడు ఆలకించాడు. ఆమెకు తక్షణమే ఒక ఉపాయం తట్టింది. ''నాన్నా! నేను రాజకుమారుని వివాహ మాడుతానని కబురు పంపించు'' అన్నది. అయితే ఒక షరతు విధించింది. ఎనిమిది రోజుల తరువాత ఇద్దరూ ఒక ఇంట్లో కలుసుకోవాలి. అప్పుడీమె కొన్ని ప్రశ్నలు అడుగుతుంది, వాటికి రాజకుమారుడు సరియైన జవాబులు చెప్పాలి. రాజుకు ఈ వార్త తెలిసి చాల సంతోషించాడు. కాని రాజకుమారుడు మాత్రం ఇంకా ఎనిమిదిరోజులా అని నిరుత్సాహపడ్డాడు.

ఆనాటి నుండి ఆమె ప్రతి దినము విరోచనాలయ్యేటట్లు మందులు తీసుకుంది. ఒక్కొక్క దినము పోయిన మలమును ఒక్కొక్క పాత్రలో నింపింది. ఎనిమిది దినములకు ఎనిమిది పాత్రలు నిండాయి. ఆ ఎనిమిది రోజులలో ఆమె బాగా చిక్కి శల్యమైపోయింది. కన్నులు గుంతలు పడ్డాయి. రూపము చాల వికారంగా మారిపోయింది. తొమ్మిదవ రోజున రాజకుమారుడు నిర్ణీత ప్రదేశానికి చేరుకొని ఆమెకోసం చాతక పక్షి వలె ఎదురు చూడసాగాడు. కొంతసేపటికి ఆ అమ్మాయి పల్లకీ నుండి దిగింది. నడవటానికి కూడా శక్తి లేకపోవడంచేత ఇరువురు చెలికత్తెలు ఆమెను పట్టుకున్నారు. వెనుక ఎనిమిదిమంది చెలికత్తెలు ఎనిమిది పాత్రలు తీసుకువస్తున్నారు. రాజకుమారుడు చూశాడు,''నేను ఆ రోజు చూసిన అమ్మాయి చాల అందమైనది. ఈమె ఎవరో రోగిష్టి మాదిరి ఉన్నది. నేను కోరినది ఈమెను కాదు'' అన్నాడు. అప్పుడామె చేతులు జోడించి, ''రాజకుమారా! మొట్టమొదట మీరు నా అందమును చూసి ఆశించారు. మలమూత్ర దుర్గంధ మాంసరక్తములతో కూడిన దీ దేహము. ఆ పాడు పదార్థములు ఈ దేహములో ఉన్నంత వరకు నేను అందచందములతో కనిపించాను. ఇప్పుడు నా అందమంతా ఆ ఎనిమిది పాత్రలలో ఉన్నది. కనుక మొట్టమొదట నా అందమును తీసుకోండి, తరువాత నన్ను వివాహమాడండి'' అన్నది. ఈ మాటలు విని రాజకుమారునికి కనువిప్పు కల్గింది. ఆనాడు గుణ్ణం ఏవిధంగా రివర్స్ తిరిగిందో అతని మనస్సు కూడా అదేవిధంగా గిఱ్ఱున తిరిగింది. ఆమె చెప్పినది సత్యమేనని గుర్తించి తాను కూడా వివాహము లేకుండా ఉండిపోయాడు. శంకరులవారు యువతరానికి బోధించినది ఇదే! అంటే అందరినీ సన్న్యాసము

తీసుకోమ్మని చెప్పలేదు. ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తించాలి, కాయాన్ని దైవసేవలో వినియోగించాలి.

**ఆత్మయే 'సినిమాతెర':** మనం చూసే సినిమాలలోను అద్వైతాన్ని దర్శించవచ్చు. ఏవిధంగా? మీరు సినిమాహాలులో కూర్చున్నప్పుడు ముందు తెల్లని తెర మాత్రమే కనిపిస్తుంది. కాని ఎంతసేపని ఆవిధంగా తెరను మాత్రమే చూస్తూ కూర్చోగలరు? కనుక బొమ్మలకోసం ఎదురు చూస్తారు. బొమ్మలొచ్చినప్పుడు ఆనందంగా తిలకిస్తారు. కాని ఆ వచ్చిన బొమ్మలేమైనా స్థిరంగా ఉంటున్నాయా? లేదు. అవి వస్తున్నాయి, పోతున్నాయి. కాని తెర రావటం లేదు, పోవటం లేదు. రాకపోకలు లేని తెరయే బ్రహ్మ, వచ్చిపోయే బొమ్మలే జగత్తు. కనుకనే 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్య' అన్నది వేదాంతము. అయితే, 'సర్వం విష్ణుమయం జగత్' అనేది కూడా వేదాంత ప్రబోధయే కదా! మరి అది నిజమా? ఇది నిజమా? అని పండితులకు సందేహం కలిగింది. 'అదీ నిజమే, ఇదీ నిజమే' అన్నారు శంకరులవారు. ఎట్లా? తెరపై బొమ్మలు వచ్చినప్పుడు మీరు ఆ బొమ్మలను మాత్రమే చూస్తారుకాని, తెరను గురించి ఆలోచించరు. అయితే బొమ్మలు వచ్చినప్పుడు తెర ఎక్కడుంటుంది? బొమ్మలలోనే కలసి ఉంటుంది. తెర లేక బొమ్మలే కనిపించవు. బ్యాక్‌గ్రౌండ్‌లో తెర ఉండటంచేతనే మనకు బొమ్మలు కనిపిస్తున్నాయి. కాబట్టి బొమ్మలలో కూడా తెర ఉన్నది. అదేవిధంగా శాశ్వతమైన విష్ణుత్వము అనిత్యమైన జగత్తులో ఏకమై ఉన్నది. కనుకనే, 'సర్వం విష్ణుమయం జగత్' అని కూడా చెప్పింది వేదాంతము. అన్ని బొమ్మలయందు ఉన్నది ఆత్మ ఒక్కటే. అదే తెర. ఆ తెరవల్లనే అన్నీ వస్తున్నాయి, పోతున్నాయి. జీవులు పుట్టడం, చావడం అంతా ఆ తెరపైననే కనిపిస్తున్నది. ప్రతి బొమ్మలోను ఆ తెర లీనమైయున్నది. అట్టి మూలాధార తత్వాన్ని ఆధారం చేసుకొని మిథ్యమైన జగత్తును మనం అనుభవించాలి. అదే అద్వైతము.

**కాన్షియన్స్‌కు విరుద్ధంగా పరకాయ ప్రవేశం:** శంకరులవారు మండనమిశ్రుని వాదములో ఓడించినప్పుడు ముందుగా విధించిన షరతు ప్రకారం అతడు సన్యాసం స్వీకరించాలని పట్టుపట్టారు. అప్పుడు మండనమిశ్రుని భార్యయైన ఉభయభారతి, "శంకరా! నీకు సర్వధర్మములు తెలుసు. నేను ఇతని అర్ధాంగిని. కాబట్టి నీవు నన్ను కూడా వాదములో ఓడించినప్పుడే ఇతను సన్యాసము స్వీకరించవలసి వస్తుంది, లేకపోతే లేదు" అన్నది. సరే, వాదించమన్నారు శంకరులవారు. ఆమె గొప్ప వేదాంతి. గృహస్థ ధర్మములో కామశాస్త్రానికి సంబంధించిన ప్రశ్న వేసింది. దానికి సమాధానం శంకరులవారికి తెలియదు. అప్పుడు ఆమె దగ్గర ఒక నెల గడువు తీసుకున్నాడు. ఆ సమయంలో కాశీరాజు మరణించాడు. శంకరులవారు రాజుగారి దేహంలోనికి పరకాయ ప్రవేశం చేశారు. రాజు మళ్ళీ బ్రతికాడని ప్రజలు ఎంతో ఆనందించి రాజభవనానికి తీసుకుపోయారు. అయితే ఆ దేహముతో సంచరించేది రాజు కాదు, శంకరులే! అప్పుడు రాజుకు సంబంధించిన గృహస్థాశ్రమంలో తాను ప్రవేశించాడు. దానితో శంకరునికి కొంత అపవిత్రత చేకూరింది. ఆ పనికి తన కాన్షియన్స్ అంగీకరించలేదు. తక్షణమే రాజు యొక్క దేహాన్ని వదలిపెట్టి తిరిగి తన దేహములో ప్రవేశించి ఉభయభారతివద్దకు పోయి ఆమె అడిగిన ప్రశ్నకు తగిన సమాధానము చెప్పాడు. తరువాత

కాశ్మీరు పండితులను కూడా ఓడించాలని బయలు దేరాడు.

***కనకదుర్గగుడిలో ప్రాయశ్చిత్తం :*** శంకరులవారు ఎప్పుడైతే కాశ్మీరులో ప్రవేశించారో తక్షణమే కొండపైనున్న కనకదుర్గ గుడి తలుపులు మూసు కున్నాయి. ఎవరెంతగా ప్రయత్నించినా అవి తెరుచు కోలేదు. అనేకమంది పండితులు వెళ్ళి ప్రార్థనలు సల్పారు. వారి భక్తి ప్రపత్తులకు మెచ్చి శక్తి స్వరూపిణియైన దుర్గ అశరీరవాణిగా ఒక మాట చెప్పింది. ''శంకరులవారు చాల గొప్ప ఆచార్యుడు. ప్రతి ఒక్కటి ముందు తాను ఆచరించి ప్రబోధిస్తూ వచ్చాడు. కాని అతనిలో ఒకవిధమైన మాలిన్యం ప్రవేశించింది. దానిని పరిహారం గావించుకోవడానికి ప్రయత్నించినప్పుడే ఈ తలుపులు తెరుచు కుంటాయి'' అన్నది. అప్పుడు శంకరులవారు తన దోషాన్ని గుర్తించి దాని పరిహారార్థమై పదకొండు దినములు నిద్రాహార పానీయాదులను త్యజించి తపస్సు చేస్తూ కూర్చున్నాడు. 12వ దినమున తలుపులు తెరుచుకున్నాయి. చూశారా! శంకరుల వారు ఎంత గొప్ప దీక్ష పూనారో! ఇంతకు ముందు మాట్లాడిన ఘటర్జీ ప్రేమను గూర్చి చెప్పాడు. ప్రేమచేతనే స్వామితత్వాన్ని అనుభవించడానికి సాధ్యమవుతుందన్నాడు. అయితే ఎట్టి ప్రేమ? లౌకిక ప్రేమ కాదు. లౌకిక ప్రేమలో ప్రవేశించడం చేతనే శంకరులవారికి దోషము చేకూరింది. అయితే అది తన ఇష్టపూర్వకంగా చేయలేదు, ఉభయభారతికి జవాబు చెప్పాలనే ఆ పని చేశాడు. దేహభావంతోకాక ఆత్మభావంతో ప్రేమించాలి. ఆత్మభిమానమే నిజమైన ప్రేమ. ఇట్టి ప్రేమతత్వాన్ని మదిలో నింపుకొనే శంకరులవారు యావత్ప్ర పంచానికి అద్వైతసిద్ధాంతాన్ని ప్రబోధించారు.

***వైరాగ్యమంటే ఏమిటి? :*** యువకులకు వైరాగ్యాన్ని అలవర్చుకొమ్మని గట్టిగా చెబుతూ వచ్చారు శంకరులవారు. అయితే కేవలం చెప్పినంత మాత్రమున, విన్నంత మాత్రమున విరక్తి రాదు. అది నాకు తెలుసు. జన్మజన్మల నుండి ప్రోగు చేసుకున్న పర్వతములవంటి పాపములు అంత సులభంగా తొలగిపోయేవి కావు. నిత్యమూ ఉపయోగించుకునే పాత్రను నిత్యమూ తోమ వలసిందే. అదేరీతిగా మనస్సును కూడా నిత్యమూ తోముతూనే ఉండాలి. ఈరీతిగా శంకరులవారు యువకులకు వైరాగ్యాన్ని ప్రబోధిస్తూ వచ్చారు. వైరాగ్య మంటే ఏమనుకుంటున్నారు? కక్కిన అన్నమును ఎవరైనా తినడానికి ప్రయత్నిస్తారా? ప్రయత్నించరు కదా! దానిపై ఎంత తీవ్రమైన విరక్తి వస్తుందో ప్రాపంచిక విషయాలపై అంత విరక్తి రావాలి. ఈ విషయంలో మీరు ఏదో 'ట్రై' చేస్తామంటే అది కాస్తా 'డ్రై' అయిపోతుంది. మీరు చేసే తీరాలి. ఎవరికోసం? మీకోసమే! ఈ జగత్తునందు మీకు కలిగే ఆనందమేమీ లేదు. ఎంత ఆదాయము వచ్చినా అంతా ఏదో ఒకనాడు త్యజించిపోవలసిందే. కనుక దైవాన్ని గట్టిగా పట్టుకోండి.

(తేది:***9.9.96***న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

---

*దోమలబారి నుండి తప్పించుకొనడానికి దోమతెరను ఉపయోగిస్తాము. అట్లే దుష్టుల సాంగత్యము నుండి, దుష్టభావముల నుండి తప్పించుకొనడానికి సత్సంగమనే 'దోమతెర'ను ఉపయోగించాలి.* -బాబా

# వైరాగ్యమే మహాభాగ్యము

''దంతముల మధ్య ఎంతో నేర్పును గల్గి
నాల్క తిరుగుచుండు నలిగిపోక
నరుడు కూడ అటులె నడుచుట మేలయా
మరువబోకు దిట్టి మంచిమాట''

''తామరాకుపై తళతళలాడే
నీటిబొట్టువలె నిలకడ లేనిది
బ్రతుకభిమానపు పొరల కొంపరా
దిగులు దుఃఖముల గతిరా లోకము
హరిగోవిందా హరిగోవిందా
హరిగోవిందా అనరా మందా!''

ఈ విశ్వమనే నాటకరంగములో మానవుడు కేవలం ఒక నటునివలె జీవించి, సుఖదుఃఖములను అనుభవించి చివరికి మరణించి మాయమవుతున్నాడని శంకరులవారు అన్నారు. ఈనాటి మానవుడు అభిమాన అహంకారములతో కూడి యుండటంచేత బ్రతుకంతా భయంతో నిండి యున్నది. నిర్భయ మనేది జీవితంలో ఎక్కడా కనిపించడం లేదు. ఎక్కడుంది నిర్భయము? వైరాగ్య మెక్కడో నిర్భయ మక్కడ. ఆ వైరాగ్యము కూడా దైవసన్నిధియందు మాత్రమే లభ్యమవుతుంది. కనుక,''మానవులారా! మీరు భయాన్ని దూరం గావించుకొని అభయాన్ని పొందాలంటే ఆత్మసన్నిధి చేరండి'' అని ప్రబోధించారు శంకరులవారు. సుఖదుఃఖములు, పాపపుణ్యములు, లాభనష్టములు, చీకటివెలుగులు - ఇవన్నీ ఒక దాని కొకటి అభావములేకాని వేరువేరు కాదు. వీటికి మూలాధారము ఒక్కటే. అదే ఆత్మ. పుష్పములోని రేకలు వేరువేరుగా కనిపించినప్పటికీ అన్నీ ఒకే స్థానము నుండియే పుడుతున్నాయి కదా! అదేవిధంగా ఆత్మ నుండియే అన్నీ ఉద్భవిస్తూ వస్తున్నాయి.

అనంతమైన సాగరము నుండి అసంఖ్యాకమైన అలలు బయలుదేరుతున్నాయి. ఒక అలవలె మరొక అల కనిపించటం లేదు. అయితే వీటన్నింటికీ మూలాధారము సముద్రమే కదా! సముద్రములో ఏ చల్లదనము, ఏ ఉప్పదనము, ఏ తడి ఉన్నవో అవి ఈ అలలలోను ఉన్నవి. ఈ అలల నుండి నురుగు ఆవిర్భవిస్తున్నది. నురుగుకు అలలే ఆధారం, అలలకు సముద్రమే ఆధారం. అదేవిధంగా దేహము మనస్సును ఆధారం చేసుకొని యున్నది, మనస్సు ఆత్మను ఆధారం చేసికొని యున్నది. కనుక మానవత్వమునకు మూలాధారము ఆత్మయే. అదియే అద్వైతమని శంకరులవారు ప్రబోధించారు.

**సిద్ధార్థుని వైరాగ్యం:** శుద్ధోధనునికి లేకలేక కల్గిన కుమారుడు సిద్ధార్థుడు. అతడు పుట్టినప్పుడు ఒక మహనీయుడు వచ్చి జాతకం చూసి, ''శుద్ధోధనా! ఇతడు గొప్ప మహారాజైనా కావచ్చు. లేక తీవ్ర వైరాగ్యంతో ఇల్లు వదలైనా పోవచ్చు'' అన్నాడు. ఈ మాటలు విని శుద్ధోధనుడు చాల భయపడిపోయాడు. ఏమి చూస్తే ఇతనికి వైరాగ్యం కల్గుతుందో అని భయపడి సిద్ధార్థుని ఎక్కడికీ పంపలేదు. 18వ సం॥లో అతనికి వివాహం చేసి యువరాజుగా పట్టం కట్టాడు. తరువాత ఒకనాడు సిద్ధార్థుడు తండ్రితో,

''రాజైనవాడు కేవలం అంతఃపురంలో కూర్చుంటే లాభం లేదు. కాబట్టి నేను రాజ్యాన్ని చూడటానికి బయటికి వెళతాను'' అన్నాడు. శుద్ధోధనుడు భయపడుతూనే అంగీకరించాడు. వివాహము చేసుకున్నాడు కనుక ఎక్కడికీ పోడనే మూఢ నమ్మకము అతనిది! సిద్ధార్థుడు రథముపై కొంత దూరం వెళ్ళిన తరువాత ఒక వృద్ధురాలు కఱ్ఱ చేతపట్టి వంగివంగి నడుస్తూ కనిపించింది. రథసారథిని, ''ఏమిటీ మృగము? చాల వింతగా కనిపిస్తున్నదే!'' అని అడిగాడు. ''ప్రభూ! ఇది మృగం కాదు, మనిషే! వయోభారంచేత ఈవిధంగా వంగిపోయింది'' అన్నాడు. ''అయితే వయస్సు పెరిగే కొలది అందరూ ఈ స్థితికి వస్తారా?'' అని అడిగాడు. ''తప్పదు ప్రభూ! ఇది సృష్టి యొక్క నైజము'' అన్నాడు. ఇంకా కొంత దూరం పోయేసరికి ఒక టి.బి. రోగి ఒక చెట్టు క్రింద కూర్చుని దగ్గుతూ, దగ్గుతూ ఆయాసంతో 'అబ్బా!' అని అరుస్తున్నాడు. ''ఏమిటిది? ఎందు కీవిధంగా అవస్థపడుతున్నాడు?'' అని ప్రశ్నించాడు సిద్ధార్థుడు. రథసారథి, ''ప్రభూ! ఈ శరీర మొక రోగముల గంప. ఎప్పు డెవరికి ఏ రోగం వస్తుందో చెప్పడానికి వీలుకాదు'' అన్నాడు. అతని మనస్సులో కొంత మార్పు కలిగింది. ఇంకా కొంత దూరం పోయే సరికి నలుగురు వ్యక్తులు ఒక శవాన్ని మోసుకుంటూ పోతున్నారు. సిద్ధార్థుడు, ''సారథీ! వాళ్ళు మోసుకొని పోతున్న దేమిటి?'' అని అడిగాడు. ''శవము, ప్రభూ!'' అన్నాడు. ''శవ మంటే ఏమిటి?''. ''ప్రాణం లేనిదే శవం''. ''ప్రాణం అందరికీ పోతుందా?'' అని సిద్ధార్థుడు మళ్ళీ ప్రశ్నించగా, ''ఇది తప్పదు. అందరికీ ఏదో ఒకనాడు ప్రాణం పోక తప్పదు'' అన్నాడు. ఈ మాటలు విని సిద్ధార్థుడు అప్పటి కప్పుడు తన టూర్‌ని క్యాన్సిల్ చేసుకొని ఇంటికి తిరిగి వచ్చాడు. భోజనం చేయలేదు. రాత్రి పడుకున్నాడు కాని నిద్ర రాలేదు. ''సర్వం దుఃఖమ్ దుఃఖమ్; సర్వం క్షణికం, క్షణికం; సర్వం శూన్యం, శూన్యం'' అని తీవ్రమైన వైరాగ్యంతో ఇల్లు వదలిపోయాడు. మనం ఎందరో రోగులను చూస్తున్నాము, ఎందరో వృద్ధులను చూస్తున్నాము, ఎన్నో శవములను చూస్తున్నాము. కాని అందరికీ వైరాగ్యము కలగటం లేదు. అది ఒక్క సిద్ధార్థునికి మాత్రమే కలిగింది. వైరాగ్యం రావాలంటే భగవదను గ్రహం కావాలి.

***జితేంద్రియ రాజ్యం :*** ఒక రాజకుమారుడు అరణ్యంలో వేటాడి బాగా అలసిపోయి మంచినీటి కోసం ఒక ఆశ్రమంలో ప్రవేశించాడు. అక్కడ నివసిస్తున్న సన్న్యాసి, ''ఎవరు నాయనా నీవు?'' అని ప్రశ్నించాడు. ''స్వామీ! నా పేరు జితేంద్రియుడు. నేను జితేంద్రియ రాజ్యము నుండి వచ్చాను. నాకు త్రాగటానికి నీరు కావాలి'' అన్నాడు. ఆ సన్న్యాసి అతనిని కూర్చోబెట్టి నీరిచ్చాడు. ఈనాడు అనేకమంది ధర్మరాజు అని పేరు పెట్టుకుంటారు, అధర్మంగా ప్రవర్తిస్తుంటారు; త్యాగరాజు అని పేరు పెట్టుకుంటారు, వారిలో త్యాగగుణం మచ్చుకైనా కనిపించదు. ఆ సన్న్యాసి తనలో తాను, ''ఇతని పేరు జితేంద్రియు డంటున్నాడు. కాని ప్రవర్తన పేరుకు తగినట్లుగా ఉన్నదా? రాజ్యము కూడా జితేంద్రియ రాజ్య మంటున్నాడు. అదేమిటో వెళ్ళి చూడాలి'' అనుకున్నాడు. ఆ రాజకుమారుని వస్త్రములను తాను తీసుకొని, తన వస్త్రములను అతని కిచ్చి, ''బాబూ! నేను అత్యవసర పని మీద వెళుతున్నాను. నీవు రెండు దినములపాటు ఇక్కడే ఉండ

వలసింది''అని కోరాడు. రాజకుమారుని బట్టలపై ఎఱ్ఱని రంగు చల్లి వాటిని తీసుకొని జితేంద్రియ రాజ్యమునకు పోయాడు. అక్కడి సిపాయిలు ఇతనిని చూసి నమస్కరించారు. ''నాయనా! మీ యువరాజు అరణ్యంలో మృగములచేత చిక్కి మరణించాడు. అతని దుస్తులను నావెంట తెచ్చాను. ఈ వార్తను మీ రాజుగార్కి తెలియ జేయండి'' అన్నాడు. అప్పుడా సిపాయిలు, ''స్వామీ! అనవసరంగా గుడ్డలెందుకు తెచ్చారు? మరణము ఎవరికి లేదు చెప్పండి! పుట్టిన ప్రతి వ్యక్తి మరణించక తప్పదు. జననముతోపాటు మరణము కూడా చేరి వస్తుంది''అన్నారు. సైలు పెట్టెను ఫ్యాక్టరీ నుండి అవసరమైన చోటికి పంపించేటప్పుడు దానిపై Return అని ఒక తేది వేసి పంపుతారు. అనగా, ఆ పెట్టెను ఫలానా తేది లోపల తిరిగి వెనక్కి పంపించాలని అర్థం. మన దేహమనే పెట్టె మీద కూడా Return తేది ఉంటున్నది. కాని, అది కనిపించటం లేదు. ఈ మాదిరి సిపాయిలు మాట్లాడేసరికి, ''వీరికి బహుశా యువరాజంటే ద్వేషమేమో''అని భావించి నేరుగా రాజు వద్దకు వెళ్ళాడు. ''రాజా! నీ కుమారుడు మరణించాడు''అని ఏడ్చాడు. సన్యాసి ఏడ్వటం చూసి రాజు ఫక్కున నవ్వాడు. ''అయ్యా! నీవు ధరించినది కాషాయవస్త్రంగాని నీ మాటలలో కషాయం నిండియున్నది. మరణానికి ఏడ్వటం ఎందుకు? సాయంకాలం చెట్టుపై వ్రాలిన పక్షులు తెల్లవారేసరికి చేని పాటికి అవి ఎగిరిపోతుంటాయి. ఒకే చెట్టుపై కూర్చున్నంత మాత్రమున వాటి మధ్య సంబంధ మేర్పడుతుందా? అదేవిధంగా భార్యాబిడ్డలు, కొడుకులు, కోడళ్ళు వీరందరూ కుటుంబమనే చెట్టుపై వ్రాలిన పక్షులవంటివారు. ఏ పక్షి ఎప్పుడు ఎగిరి పోతుందో! దీనికి విచారించ నవసరం లేదు. ఇది సహజము''అన్నాడు. ''అబ్బా! ఈ రాజు ఎంతటి కఠినుడు!''అనుకొని తిరిగి రాణీగార్కి చెప్పడానికి వెళ్ళాడు. ఎంతైనా తల్లి కదా, తప్పకుండా దుఃఖిస్తుంది అనుకున్నాడు మనస్సులో. ''అమ్మా! నీ కుమారుడు మరణించాడు, ఇవిగో దుస్తులు''అన్నాడు. ఆమె కూడా ఫక్కున నవ్వింది. ''స్వామీ! మీరు సర్వసంగ పరి త్యాగులు కదా! మీకు కూడా ఈ అభిమాన మెందుకు? ప్రయాణీకులు రాత్రిపూట సత్రములో ఆగుతారు. తెల్లవారి లేస్తూనే ఎవరి దారిన వారు వెళ్ళిపోతారు. ఈ ప్రపంచమే ఒక సత్రము వంటిది. మోక్షపురికి వెళ్ళే ప్రయాణీకులు ఈ సత్రములో దిగుతుంటారు. ఎవరు ఎప్పుడు వెళ్ళి పోతారో చెప్పడానికి వీలుకాదు. కాబట్టి ఏని కోసం దుఃఖించడ మెందుకు?''అన్నది. కనీసం భార్యయైనా ఏడుస్తుందేమో అనుకొని ఆమె వద్దకు వెళ్ళాడు. ''తల్లీ! నీ పతి మరణించాడు'' అన్నాడు. అప్పుడామె చెప్పింది - ''స్వామీ! తుఫాను గాలికి చెట్టుకొమ్మలు విరిగి రాలి పోతుంటాయి. ఆ ప్రవాహంలో ఎక్కడో ఒక అడవి నుండి కొట్టుకొని వచ్చిన ఒక కట్టె, మరొక అడవి నుండి కొట్టుకొని వచ్చిన మరొక కట్టెతో కలుసుకుంటుంది. ఈ కట్టెలు మధ్య మధ్య కలుస్తుంటాయి, విడిపోతుంటాయి. ఈ సంసారమనే సాగరంలో నేనొక అడవికట్టె, ఆయనొక అడవికట్టె. ఈ రెండు కట్టెలూ కొంత కాలం కలుసుకున్నాయి, ఇప్పుడు విడిపోయినాయి. దీనికి బాధపడవలసిన అవసరం లేదే!'' ఈ మాటలు విని సన్యాసి నిర్ఘాంతపోయాడు. ''ఇది పేరుకు తగినట్లు నిజంగా జితేంద్రియ రాజ్యమే'' అనుకున్నాడు. మరి రాజకుమారుని కూడా పరీక్షించాలి కదా! అక్కడి నుండి అరణ్యానికి తిరిగి వెళ్ళి, ''రాజకుమారా! శత్రురాజులు మీ

రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని అమ్మానాన్నలను చెఱసాలలో పెట్టారు. నీవు తక్షణమే వెళ్ళి యుద్ధం చేసి వారిని విడిపించు''అన్నాడు. అప్పుడా రాజకుమారుడు, ''స్వామీ! అంతా దైవసంకల్పానుసారం జరుగుతుంది. ఆ రాజ్యమును నేను పుట్టే సమయంలో తెచ్చుకున్నానా? పోయే సమయంలో తీసుకపోతానా? కనుక నేనిప్పుడు పోయి యుద్ధం చేసి ఆ రాజ్యాన్ని జయించవలసిన అవసరం లేదు. నా రాజ్యము ఆత్మసామ్రాజ్యమే. అది నాకు లభ్యం కావాలి. అది పోరాడితే లభ్యమయ్యేది కాదు, ప్రేమతో దానిని సాధించాలి''అన్నాడు. అప్పుడా సన్యాసి రాజకుమారునికి సాష్టాంగ నమస్కారం చేశాడు, ''నాయనా! మేము సన్యాసులుగా వేషాలు వేస్తున్నాము. కాని వేషమునకు తగిన ప్రవర్తన మాలో లేదు. కాని నీవంటి సంసారులు ఎంత మందో నిజమైన వైరాగ్యంతో జీవితాన్ని గడుపుతున్నారు''అన్నాడు.

***వేషానికి తగిన ప్రవర్తన:*** ఒక పగటి వేషగాడు శంకరాచార్యుని వేషం వేసుకొని రాజసభలో ప్రవేశించాడు. రాజుగారు అతనికి ఉచితాసన మిచ్చి ఆదరించాడు. అతడు ఒక గంటసేపు అనర్గళంగా ఆత్మతత్వమును, అద్వైతసిద్ధాంతమును సభికులకు బోధించాడు. సభ ముగిసిన తరువాత రాజు ఒక తట్టలో బంగారుకాసులను పెట్టి, ''మీరు బంగారం వంటి మాటలు చెప్పారు. కనుక వీటిని బహుమానంగా ఇస్తున్నాను''అన్నాడు. అప్పుడా వ్యక్తి, ''రాజా! సర్వసంగ పరిత్యాగమే సన్యాసి లక్షణము. నేను నీ బహుమానం నిమిత్తమై రాలేదు. నీ బహుమానము నాకు అవమానము. కనుక నాకు అక్కర లేదు''అని వెళ్ళిపోయాడు. రెండవ రోజున అదే వ్యక్తి ఒక నర్తకివలె వేషం వేసుకొని వచ్చి రాజసభలో అత్యద్భుతంగా నృత్యం చేశాడు. మంత్రి చాల తెలివిగలవాడు. ''నిన్నటి దినమున శంకరాచార్య వేషము వేసుకొని వచ్చినది ఇతడే''అని గుర్తించాడు. రాజాజ్ఞ ప్రకారం మళ్ళీ బంగారుకాసులు తెచ్చి బహుమానంగా ఇవ్వబోయాడు. ''రాజా! నేను చేసిన నృత్యానికి బహుమాన మింతేనా! నాకింకా ఎక్కువ కావాలి''అన్నాడు. అప్పుడు మంత్రి, ''అయ్యా! నిన్న సన్యాసిగా వచ్చినప్పుడు బహుమానమే అక్కరలేదన్నావు. ఈనాడు నర్తకిగా వచ్చి ఇంతా ఎక్కువ కావాలంటున్నావు. ఏమిటి దీని అంతరార్థము?''అని అడిగాడు. అప్పుడా వ్యక్తి, ''వేషమునకు తగిన ప్రవర్తన, నామమునకు తగిన నడత అత్యవసరం. నిన్న సన్యాసి వేషముతో వచ్చాను, వేషమునకు తగిన వైరాగ్యమును ప్రదర్శించాను. ఈనాడు నర్తకి వేషముతో వచ్చాను. కాబట్టి వేషమునకు తగిన ఆశను వ్యక్తపరుస్తున్నాను''అన్నాడు.

ప్రేమస్వరూపులారా! మీరు మానవులుగా పుట్టారు. కనుక మానవత్వంతో జీవించాలి. మానవతా విలువలను ప్రదర్శించాలి. మనస్సు, మాట, క్రియ - ఈ మూడింటి ఏకత్వమే మానవత్వము. దీనినే వేదాంతము 'త్రికరణశుద్ధి' అని చెప్పింది. ఈ మూడింటి ఏకత్వముచేతనే మనలో ప్రేమ ఆవిర్భవిస్తుంది. ప్రేమ ఆవిర్భవించినప్పుడే హృదయకమలము వికసిస్తుంది. హృదయకమలము వికసించినప్పుడే వైరాగ్యము అభివృద్ధి అవుతుంది. శంకరులవారు అనేక ప్రాంతములలో పర్యటించి దుఃఖితులైన మానవులకు ధైర్యసాహసములను చేకూర్చి అద్వైతమును, మానవతా విలువలను ప్రబోధిస్తూ వచ్చారు. అతని వెంట ఉండిన శిష్యులు భజ

గోవిందములోని 12శ్లోకములను చెప్పారు. వారు కూడా అద్వైతమత ప్రచారంలో లీనమైపోయారు. అప్పటికి భారతదేశంలో అద్వైతసిద్ధాంతము స్థిరపడి పోయింది. కాని క్రమక్రమేణ ఈ ఆధునిక యుగ ప్రభావంచేత చల్లబడుతూ వచ్చింది.

ప్రేమస్వరూపులారా! మీరు సన్యాసము తీసుకోవాలని నేను చెప్పటం లేదు. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తించుకుంటూ, లక్ష్యమును భగవంతునిపై పెట్టండి. అన్నింటికీ మూలాధార మొకటున్నదనే సత్యాన్ని గుర్తించండి. వైరాగ్యము బలవంతంచేత వచ్చేది కాదు. భగవంతునిపై ప్రేమ పెరిగే కొలది వైరాగ్యము కూడా పెరిగి పోతుంది. బీగములో 'కీ' పెట్టి ఎడమవైపు త్రిప్పితే మూసుకుంటుంది, కుడివైపు త్రిప్పితే తెరుచుకుంటుంది. అదే తాళము, అదే 'కీ' దానిని త్రిప్పడంలో ఉన్నది తేడా! మన హృదయమే ఒక తాళము, మనస్సే దాని 'కీ'. దానిని భగవంతునివైపు త్రిప్పితే డిటాచ్‌మెంట్ (వైరాగ్యము) ; ప్రకృతివైపు త్రిప్పితే అటాచ్‌మెంట్ (బంధన). ఇది ఎట్లా? అని మీకు సందేహము కలుగవచ్చు. మీ కిప్పుడు రెండు కాళ్ళున్నాయి. కాని మీరు ఉద్యోగంలో చేరిన తరువాత మీ అమ్మానాన్నలు ఒక అమ్మాయిని తెచ్చి మీకు కట్టేస్తారు. లేకపోతే మీ అంతట మీరే కట్టుకోవచ్చు. ఎలాగైతే నేమి! అప్పుడు నాలుగు కాళ్ళు అవుతాయి. మీవి రెండు, ఆమెవి రెండు! తరువాత 6 కాళ్ళవుతాయి, తరువాత 8 కాళ్ళవుతాయి. ఈవిధంగా కాళ్ళు అధికమయ్యే కొలది నడక చల్లారిపోతుంది. అదే బంధన (Bondage). ఇది ఎక్కడి నుండో వచ్చేది కాదు. మీ కోరికల నుండే వస్తున్నది. లగేజి ఎంత తక్కువైతే ప్రయాణం అంత సుఖంగా సాగిపోతుంది. జీవితము చాల దీర్ఘప్రయాణము. ఇందులో కోరికలనే లగేజిని ఎంత తగ్గించుకుంటే ఆనందము అంత పెరుగుతూ వస్తుంది.

(తేది:*10.9.96*న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)

---

## మనస్సు - ఇంద్రియములు

మనస్సు ఇంద్రియములను అనుసరించడంచేత దాని శక్తి క్రమేణా క్షీణించిపోతున్నది. మనస్సు ఇంద్రియములకు అధికారి. అధికారియైన మనస్సు పరిచారకులైన ఇంద్రియముల ననుసరిస్తే ఏమి గౌరవముంటుంది చెప్పండి! పట్టపురాణియైన కైక పరిచారికయైన మంథర మాటలను విని అనుసరించడంచేతనే తన నాథుని కోల్పోయింది, ఆత్మస్వరూపుడైన రాముని అరణ్యానికి పంపించింది, అపకీర్తి పాలయింది. ఈనాడు మన పరిస్థితి కూడా అదేరీతిగా ఉన్నది. మన మనస్సనే కైక తన పరిచారకులైన ఇంద్రియములకు లొంగిపోవడంచేత దేహశక్తులను కోల్పోతున్నది, ఆత్మవిశ్వాసాన్ని దూరం చేసుకుంటున్నది, దుఃఖమునకు నిలయంగా మారిపోతున్నది.

-బాబా

# సత్యోపనిషత్

(గత సంచిక తరువాయి)

స్వామీ! కోపతాపాలు, రాగద్వేషాలు, అభిమాన మమకారాలు, అహంకార అసూయలవంటి దుర్గుణాలు మాలో ఎందుకు కల్గుతున్నాయి? ఇవి పోవాలంటే మార్గమేమిటి?

వీటన్నింటికీ దేహభావం కారణం, దేహాభిమానం మూలం. ఇవి మనస్సు నుండి పుడుతున్నాయి. వ్యక్తుల మధ్య ఉండే సంబంధముల ఆధారంగా ఏర్పడుతున్నాయి. ఒక చిన్న ఉదాహరణ: నీవు, నీ స్నేహితుడు ఎంతో ఆత్మీయంగా, మమేకంగా ఉన్నప్పుడు నీవు అతనిపై ఒక గులాబీపువ్వు వేశావనుకో. అత దేమనుకుంటాడు? "నాపైనున్న ఆప్యాయతవల్ల నా స్నేహితుడు ఈ అందమైన గులాబీపువ్వును నాపై వేశాడు" అనుకుంటాడు. దురదృష్టవశాత్తు మీ ఇరువురి మధ్య భేదాభిప్రాయాలు వచ్చాయనుకో. ఈ పర్యాయం నీవు మళ్ళీ ఒక గులాబీపువ్వును అతనిపై వేస్తే, "దీని ముల్లు నాకు గుచ్చుకోవాలని నాపై వేశాడు" అనుకుంటాడు. వ్యక్తులు మీరిద్దరే, గులాబీపువ్వు అదే. మరి మార్పు ఎక్కడ వచ్చింది? మనస్సులో వచ్చింది. అభిమానంలో గులాబీపువ్వు ఆనందాన్నిచ్చింది, ద్వేషంలో క్రోధాన్నిచ్చింది. ఈ రెండింటికీ మనస్సే కారణం.

ఇంక కోపతాపాలను చూద్దాం. కోపంవల్ల విచక్షణాజ్ఞానం నశిస్తుంది. ఆరోగ్యం క్షీణిస్తుంది. కొన్ని నెలలు తిన్న ఆహారం నుండి లభించిన శక్తి ఒక్కసారిగా హరించిపోతుంది. అసలు కోపం దేనికి? నిన్ను ఎవరైనా ఏదైనా అన్నప్పుడు నీకు కోపం వస్తుంది. ఇక్కడ కాస్త విచారించు. నీలో ఉన్నదాన్ని ఎదుటివాడు అన్నప్పుడు నీకు కోపం దేనికి? ఉన్నమాటే అన్నాడు కదా! సరిదిద్దుకో, సరిపోతుంది. ఒకవేళ నీలో లేనిమాట అన్నాడనుకో. అప్పుడు కూడా నీకు కోపం అనవసరం. ఉదాహరణకు నన్నెవరైనా "బట్టతలబాబా" అన్నారనుకో, నాకు కోపం లేదు. ఎందుకని? నాకు బట్టతల ఉంటేగా బాధ! లేదే! అలాగే ఎవరైనా నన్ను "బుట్టతలబాబా" అని అన్నాడనుకో. అప్పుడూ నాకు కోపం లేదు. ఎందుకంటే నాకున్నదే బుట్టతల. ఉన్నమాటన్నప్పుడు కోపం దేనికి? ఈ ప్రకారం ఆలోచిస్తే కోపతాపాలు తగ్గిపోతాయి. ఇంక అసూయ చాల భయంకరమైనది. ఏ రోగానికైనా మందుందికాని అసూయకు మందు లేదు.

అహంకారం అధఃపతనానికి కారణం. అసలు దేన్ని చూసి అహంకరించడం? నీ అజ్ఞానంవల్ల అహంకరిస్తున్నా వంతే! ఇంతటి విశాల విశ్వంలో భూమి పరిమాణం

చిన్న చీమంత ఉంటుంది. అందులో భారతదేశం చీమ కన్నంత ఉంటుంది. అందులో నీ రాష్ట్రం, నీ జిల్లా, నీ గ్రామం కంటిలోని నలుసు కన్నా చిన్నవి. ఇంక నీ వీధిలో నీ వెంత? ఇలా ఆలోచిస్తే నీవు చాల అల్పుడవని తేలిపోతుంది. ఇంక అహంకా[illegible] ఎందుకు? నిన్ను మించిన అజ్ఞాని, మూర్ఖుడు లేడని అహంకరించాలి, అంతే!

ఇంక, 'నేను-నాది' అనే భావముల నుండి ఏర్పడినవే అభిమాన మమకారాలు. ఇవి కూడా మంచివి కావు. ఒక అమ్మాయి ఉన్నది. ఆమెకు కారణాంతరాలవల్ల ప్రాణం మీదికి వచ్చిందనుకో, ఆ విషయం నీ కేమీ పట్టదు. కాని కాలానుగతిన ఆ అమ్మాయి నీ భార్య అయిందనుకో. అప్పుడామెకు ఏ కొద్ది జ్వరం వచ్చినా ఆఫీసుకు సెలవు పెడతావు. అదే అభిమానం. నీ ఇంటిప్రక్కవానికి ఎంత జబ్బు చేసినా నీకు సంబంధం లేదు. కాని విదేశాలలో ఉన్న నీ కుమారునికి కాస్త తలనొప్పి వస్తే నీకు బాధ. అదే మమకారం. ఈ ప్రకారం యోచిస్తే అభిమాన మమకారాలను తగ్గించుకోవచ్చు. ఈ మమకారంవల్ల ధృతరాష్ట్రుడు తన కుమారులు చేసిందల్లా సమర్థిస్తూ వచ్చాడు. కనుకనే అతనికి నూరుమంది పుత్రులున్నప్పటికీ చివరికి తర్పణం వదలడానికి ఒక్కరు కూడా లేకుండా పోయారు. ఇది మమకారం చేసే కీడు. ఈ కోపం, అసూయ, అహంకారం ఇవన్నీ మానవలక్షణాలు కాదు, పశులక్షణాలు. ఇవి నీలో ప్రవేశించినప్పుడు, "నేను మనిషిని, పశువును కాదు" అని పదిసార్లు నీలో నీవు అనుకో. అప్పుడివి నిన్ను వదలిపోతాయి.

భగవంతుని అనుగ్రహం లభించాలంటే ఏం చెయ్యాలి స్వామీ?

భగవంతుని హృదయాన్ని కరిగించి, కదిలించేది భక్తి ఒక్కటే. భగవంతుడు నీ సంపదను, పాండిత్యమును, అధికారమును చూడడు. రామాయణంలో గుహుని పాండిత్య మెంత? శబరి ఏమంత శ్రీమంతురాలు? ఋడత ఉడుతలో రాముడు ఏది చూసి కరుణించాడు? పక్షియైన జటాయువుకు తండ్రియైన దశరథునికి కూడా లేని సద్గతిని కల్గించడానికి ఏది కారణం? వానరమూర్తియైన హనుమంతుడు దేనివల్ల ఎల్లరకును పూజనీయుడైనాడు? శత్రుపక్షములోని విభీషణుడు ఎలా రామునికి దగ్గరైనాడు? ఈ ప్రకారంగా చూస్తే భక్తిచేతనే దైవానుగ్రహాన్ని పొందవచ్చునని స్పష్టమవుతున్నది. భాగవతంలో గోపికల భక్తి మహోన్నతమైనది. చివరికి కొమ్మలలోను, రెమ్మలలోను, పూలలోను, తీగలలోను వారు కృష్ణుణ్ణి దర్శించగలిగారు. అది భక్తికి పరాకాష్ఠ. త్యాగరాజు, రామదాసు, సూరదాసు, తులసీదాసు, మీరా మున్నగు వారందరూ భక్తిచేతనే భగవంతుని కరిగించి, కదిలించి, వరించి, తరించిన మహాభక్తులు. మంగళసూత్రధారణ అయిన వెంటనే వధువుకు వరుని ఆస్తిపై హక్కు ఏర్పడుతుంది. అలాగే భక్తిసూత్రాన్ని ధరించిన వెంటనే భగవంతుని అనుగ్రహంపై నీకు హక్కు ఏర్పడుతుంది. కనుక భక్తిమార్గమే ఉత్తమం.

# శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,

ప్రశాంతినిలయం - 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా

దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్ నెంబరు 0990001032

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్ నెంబరు. 2001198

## ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా

| వరుస నెంబరు | పేరు | ధర రూ.పై | వరుస నెంబరు | పేరు | ధర రూ.పై |
|---|---|---|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | 8-50 | 31. | వచనామృతము | 18-50 |
| 2. | గీతా వాహిని | 18-00 | 32. | షిరిడి నుండి పుట్టపర్తి | 40-00 |
| 3. | ధర్మ వాహిని | 18-00 | 33. | యుగావతారీ సాయిశా | 25-00 |
| 4. | ప్రశాంతి వాహిని | 11-00 | 34. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) | 27-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | 14-00 | 35. | వాక్యవిభూతి | 6-00 |
| 6. | భాగవత వాహిని | 18-00 | 36. | ప్రేమసుధా స్రవంతి | 52-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | 35-00 | 37. | శ్రీసత్యసాయిగీతామృతము | 46-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | 18-00 | 38. | సాయిబాటలో నా పయనము | 55-50 |
| 9. | లీలాకైవల్య వాహిని | 4-50 | 39. | ప్రబోధ పంచామృతము | 15-00 |
| 10. | సత్యసాయి వాహిని | 14-00 | 40. | సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక | 25-00 |
| 11. | జ్ఞాన వాహిని | 11-00 | 41. | శ్రీసత్యసాయి గీతా | 30-00 |
| 12. | ధ్యాన వాహిని | 15-00 | 42. | శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి | 28-00 |
| 13. | ప్రేమ వాహిని | 9-00 | 43. | సత్యసాయి సమర్పన | 15-00 |
| 14. | విద్యా వాహిని | 12-00 | 44. | భక్తోద్ధారక శ్రీసత్యసాయి | 28-00 |
| 15. | సూత్ర వాహిని | 8-50 | 45. | హృదయ పుష్పాలు | 15-00 |
| 16. | అద్భుతమూర్తి | 37-00 | 46. | పుష్పాంజలి | 20-00 |
| 17. | ఆత్మారామమ్ | 44-00 | 47. | మూఢమతి - ముక్తమతి | 23-50 |
| 18. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | 18-00 | 48. | పర్తీశునితో పంచ దశాబ్దాలు | 27-00 |
| 19. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | 14-00 | 49. | శ్రీసత్యసాయి దివ్య లీలామృతము | 15-00 |
| 20. | భజనావళి | 27.50 | 50. | ప్రేమజ్యోతి | 45-00 |
| 21. | మనస్సు - మర్మము | 14-00 | 51. | మాతృశ్రీ ఈశ్వరమ్మ | 44-00 |
| 22. | సందేహ నివారిణి | 24.00 | 52. | భక్తి రసాయనం | 18-00 |
| 23. | చిన్నకథ (1వ భాగం) | 17-00 | 53. | జయభేరి | 17-00 |
| 24. | చిన్నకథ (2వ భాగం) | 18-00 | 54. | శ్రీసత్యసాయి విన్నపములు | 17-00 |
| 25. | చిన్నకథ (3వ భాగం) | 23-00 | 55. | పరమానంద శ్రీసాయి సన్నిధి | 5-00 |
| 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | 40-00 | 56. | శ్రీసత్యసాయి అనుగ్రహం | 5-00 |
| 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | 43-00 | 57. | మూలపురుషుడు శ్రీ సత్యసాయి | 5-00 |
| 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | 38-00 | 58. | శ్రీసత్యసాయీశోపనిషత్ | 5-00 |
| 29. | సత్యం శివం సుందరం (4వ భాగం) | 27-00 | 59. | గీతామకరందం | 3-00 |
| 30. | మణిమాల | 20-00 | 60. | సౌందర్య కుసుమము | 3-00 |

